## Bibliographic Record Target

కమ్యూనిస్టు కరపత్రము / అనువాదకుడు సామ్యవాది. - 2. కూర్పు. - ఎలమర్రు. కృష్ణా జిల్లా: ఆదర్శ గ్రంథమండలి, 1934.

109 p. ;18 cm.

Record no. 45

Kamyūnisṭu Karapatramu / anuvādakuḍu Sāmyavādi. - 2. kūrpu. - Elamarru. Kṛṣṇā jillā: Ādarśa Granthamaṇḍali, 1934.

109 p. ;18 cm.

Record no. 45

# కమ్యూనిస్టు కరపత్రము.

అనువాదకుడు:

'సామ్యవాది'



ప్రకాశకులు:

ఆదర్శగ్రంథమండలి.

ఎలమర్రు, కృష్ణాజిల్లా.

రెండవకూర్పు

2000

1934



---



**DONOR**
***Prof. T.V. SATYANARAYAN***
27-2-1936 – 5-4-1998



ముద్రాపకులు:—
శ్రీ పాండురంగప్రెస్, ఏలూరు

# ఉపోద్ఘాతం

ప్రస్తుతం దేశమందంతా కమ్యూనిజం అనే పేరు మారుమోగుతూ ఉంది. ఎక్కడవిన్నా సామ్యవాదచర్చలే. ఎక్కడచూచినా కాంగ్రెసు సామ్యవాదపక్షాలే.

అందుచేత, నిజంగా సామ్యవాదమంటే ఏమిటి, కమ్యూనిజంఅంటే ఏమిటి, అనేవిషయము ప్రజలకంతా తెలిసే దానికి ఈకరపత్రాన్ని ప్రకటించడం మంచిదనుకున్నాను.

సామ్యవాదానికి మూలపురుషులగు మార్క్సు ఎంజిల్సుచే స్వయంగా రచించబడ్డ ఈ కరపత్రానికన్న ఆసిద్ధాంతాలను స్పష్టంగా తెలిపేపుస్తకం వేరొకటిలేదు. ఆచరణవిధానాలగురించి లెనినుయొక్క "ఏమిచెయ్యాలి" "ప్రభుత్వం విప్లవం" అనే పుస్తకాలూ, ఎట్లు అద్వితీయాలో ఇదికూడ సిద్ధాంతరీత్యా అట్లే అసమానమయింది. మార్క్సు ఎంజల్సు తదితరుల వ్రాసిన తదుపరిపుస్తకాలన్నీ దీనియొక్క వ్యాఖ్యలనే చెప్పవచ్చు.

ఈభాషాంతరీకరణమందంతా 'సామ్యవాద' మనే పదాన్ని ఉపయోగించక, 'సోషలిజం' 'కమ్యూనిజం' అనేపదాలనే

ఉపయోగించి ఉన్నాను. సామ్యవాదం చాల అస్పష్టమైనపదం సోషలిజానికీ చెందుతుంది; కమ్యూనిజానికీ చెందుతుంది: అల్లే అనేక ఇతర పక్షాలకు, తెగలకు చెందుతుంది. సోషలిజం అనే పదం కూడ అల్లే అనేక ఇతర తెగలకుకూడ వర్తించును. రెండింటికినీ సమానంగా మనము ఉపయోగిస్తూవున్న సామ్యవాదమనే పదాన్ని మాని ఇంగ్లీషు పదాల్నే వాడుట మంచిదని నా అభిప్రాయం.

పాఠకులు సహృదయముతో చూపిన అనేక తప్పులను సరిచూచి ఈరెండవకూర్పుయందు వివరణాత్మక సూచనలను, కూడచేర్చగలిగితినని విన్నవించుచున్నాను.

'కమ్యూనిస్టు ప్రణాళిక, అను శీర్షికనుమాని 'కమ్యూనిస్టు కరపత్రము' అనివాడితిని. 'ప్రణాళిక' అనుపదము పుస్తకమందు ఇతరఅర్థములందు వాడబడియుండుటచేతను' శీర్షికను దిద్దడమే సమంజసంగా ఉండడంచేతనూ అట్లు మార్చితిని.

తర్జుమాదారుడు.

# భూమిక.

ఈకరపత్రం కమ్యూనిస్టు సంఘముయొక్క కార్య ప్రణాళికను తెలిపేదానికి ప్రకటించబడింది. ఆ కమ్యూనిస్టు సంఘం 1848 కు ముందుండే రాజకీయపరిస్థితులలో తప్పకుండా రహస్యసంఘంగానే ఉండవలసివచ్చింది. మొట్టమొదట కేవలం జర్మనుకమ్యూనిస్టుల సంఘంగానే ఉండింది. కాని పిమ్మట అది అంతర్జాతీయ కమ్యూనిస్టుల సంఘమయింది. 1847 నవంబరు నెలలో, లండనునగరములో జరిగిన సంఘ సమావేశంలో పార్టీ ఎట్టి ఆదర్శాలపై పనిచేయదలచుకుందీ, వానిని ఆచరణలోకెట్లు తీసుకొనిరాదలచుకుందీ సాకల్యంగా చర్చించే ఒక కరపత్రాన్ని, ప్రకటించేదానికి తయారు గావించుమని, మార్క్సు, ఎంజిల్సు నియమించబడ్డారు. 1848 జనవరినెలలో, జర్మనుభాషలో వ్రాయబడింది. ఫిబ్రవరి24వతారీఖునజరిగినఫ్రెంచివిప్లవానికి(1)కొన్నివారాలు ముందు, లండనునగరములో ఉండే ఒకముద్రణాధికారికి పంపబడింది. 1848 జూన్(2)తిరుగబాటుకుకొంచెంముందుగాపారిస్ నగరంలో ఫ్రెంచి భాషాంతరీకరణం వెలువడింది. 1850 లో దీని ప్రథమ ఇంగ్లీషు భాషాంతరీకరణం హెలన్‌మాక్ఫర్లేను కన్యచే చేయబడింది. అది జార్జిజూలియన్‌హార్నిచే నడుప

బడుచుండే 'రెడ్ రిపబ్లికన్' అనే పత్రికలో ప్రకటించబడింది! పోలిషు భాషలోనికీ, డేనిషు భాషలోనికి కూడ తర్జుమా చేయబడి ప్రకటించబడింది.

ధనికులు పెట్టుబడిదారులుండే (౩) బూర్జువావర్గానికిన్నీ శ్రామికవర్గానికిన్నీ జరిగిన మొదటి పెద్దయుద్ధం 1848 జూన్ పారిస్ తిరుగుబాటే. దాని ఓటమి కొంతకాలమువరకు ఐరోపా ఖండ కార్మికులయొక్క సాంఘిక రాజకీయాకాంక్షల విజృంభణాన్ని ఆపింది. అప్పటినుండీ అధికారంకోసం ఫిబ్రవరివిప్లవానికి పూర్వమువలె తిరిగి ఆస్థిపరులగు వివిధ తెగలమధ్యనే దెబ్బలాట జరుగుచుండింది. కార్మికవర్గం రాజకీయరంగాన కాలు చేయి కదిపే దానికి కావలసినంత స్థలాన్ని సంపాదించేదానికే పోరాడడంలోనే లగ్నం కావలసివచ్చింది. మధ్యమ శ్రేణికి చెందిన అతి ఉదారవాదులలో అతివాదులై కార్మికులు ఉండవలసి వచ్చింది. స్వతంత్ర శ్రామికోద్యమాలు ఎచ్చట తల యెత్తినను, నిర్దాక్షిణ్యంగా అణచివేయబడుచుండేవి. అప్పుడు కొలోనులో ఉండిన కమ్యూనిష్టు సంఘము యొక్క కేంద్రనిర్వాహకవర్గంకూడ ఇట్లే ప్రషియను పోలీసుల పాలపడింది. సభ్యులు అరెస్టు చేయబడ్డారు. 18 నెలలు చెరసాల వాసం పిదప 1852 అక్టోబరులో విచారణకు తీసుకుపోబడ్డారు. ఈ జగత్ప్రసిద్ధమైన కొలోను కమ్యూనిష్టు కేసు అక్టోబరు 4 నుండి నవంబరు 12 వరకు సాగింది. ఏడుగురికి మూడు మొదలు



ఆరు సంవత్సరాలు ఒక దుర్గాన ఖైదీలుగా ఉండేటట్లు శిక్ష విధించబడ్డది. ఈ శిక్ష వేసిన వెంటనే మిగిలిన సభ్యులు శాస్త్రీయంగా సంఘాన్ని రద్దుపరచివేశారు. ఇక ఈ కరపత్రం మారుమూల పడిపోక తప్పదని తోచింది.

శాసకవర్గాలపై మరియొకదాడికి కావలసిన శక్తి యూరపు కార్మికవర్గము సంపాదించుకోగానే, అంతర్జాతీయ కార్మికులసమితి ఆవిర్భవించింది. యూరపు, అమెరికా ఖండాలలోని యోద్ధులైన శ్రామికులందరినీ, ఒకే సంఘానికి చెందేటట్లు చేయగోరే ప్రకటిత తాదర్మ్యంగల ఈ సమితి, కమ్యూనిస్టు కరపత్రంలోని సిద్ధాంతాలను వెంటనే చాటజాలకపోయింది. అంతర్జాతీయ కార్మికసమితి, ఇంగ్లీషువారి కూలీలసంఘాలకు ఫ్రాంసు, బెల్జియం, ఇటలీ, స్పెయినులోని ప్రౌడను అనుయాయులకు జర్మనీలోని లాస్సలే అనుయాయులకూ, సమ్మతమగు కార్యప్రణాళికను కలిగియుండక తప్పింది కాదు. అన్ని పార్టీలకు సంతృప్తికరమయ్యేటట్లు ఈ కార్యక్రమాన్ని రచించినమార్క్సు, అందరు కలసి పనిచేయుటచేతనూ, పరస్పర చర్చలచేతనూ, నిస్సంశయముగా కలిగే కార్మికుల మేధాశక్త్యభివృద్ధియే దీనిని జయప్రదంగా ఆచరణలో పెట్టుతుందని పూర్తిగా నమ్మియే దీనిని వ్రాశాడు. పెట్టుబడిదారులతోటి పోరాటములోని ఘటనలే, హెచ్చుతగ్గులే, మనుష్యులకు వారి కత్యంత ప్రీతికరములైనవారి

వివిధరహస్య చికిత్సలూ సరిపోవని తోచేటట్లు చేసియుండేవి జయాలకన్న అపజయాలే దీనికెక్కువ తోడ్పడియుండేవి. వీరిమార్గాలుసరిపోకపోవడమే,కార్మికవర్గ విముక్తికి పరిస్థితుల నిజస్వరూపాన్ని పూర్తిగ గ్రహించేదానికి మార్గముతీసియుండేది. మార్క్సు సిద్ధాంతాలూ ఊహాలూ, సత్యమయ్యాయి. 1874లో చెల్లాచెదరైన ప్రథమ అంతర్జాతీయ కార్మిక సమితి 1864 లోని కార్మికులను పూర్తిగా మార్చివేసి నూతన మనుష్యులనుగా రంగానవదిలిపెట్టిపోయింది. ఫ్రాంసులో ప్రౌఢను (4) సిద్ధాంతాలూ, జర్మనీలోలాస్సలే (5) సిద్ధాంతాలు పూర్తిగా క్షీణించి మటుమాయయ్యే స్థితికి వచ్చాయి. యథాస్థితివాదుల దృష్టిగల ఇంగ్లీషుకార్మిక సంఘాలుకూడ, వాటిలో ఎక్కువభాగం అంతర్జాతీయకార్మిక సమితితో చాలకాలనికి ముందే సంబంధాన్ని తెంచుకొనియుండినప్పటికి, క్రమేణ ఎంతో అభివృద్ధిగాంచాయి. గత వత్సరం స్వాన్సీవద్ద వానిఅధ్యక్షుడు, ఈఅభివృద్ధిమూలంగనే వానితరఫునఇట్లుచెప్పకలిగాడు "యూరపుఖండమందుండేసోషలిజం మనలను ఇప్పుడు భయభీతులను గావించడంలేదు." నిజంగా కమ్యూనిస్టు కరపత్రంయొక్క మూలసిద్ధాంతాలు అన్నిదేశాల కార్మికులలోను చాలవరకు చొచ్చుకపోయాయి.



ఈవిధంగా కమ్యూనిస్టు కరపత్రంకూడ పైకివచ్చింది. 1850 పిదప స్విట్జర్లండు, ఇంగ్లండు, అమెరికాలలో, జర్మను ప్రతి కొన్నిపర్యాయాలు పునర్ముద్రించబడింది. 1872 లో, న్యూయార్కులో ఇంగ్లీషులోకి తిరిగి తర్జుమా చేయబడింది, అచ్చట అది 'ఉడ్ హుల్ క్లాఫిన్సు వీక్లీ' అనే వారపత్రికలో ప్రకటించబడింది. ఈ ఇంగ్లీషు తర్జుమా నుండియే ఒక ఫ్రెంచి తర్జుమాకూడా, న్యూయార్కులోని 'లీసోషలిస్టు' లో వచ్చింది. తదుపరి కనీసం మరిరెండు ఇంగ్లీషు భాషాంతరీకరణాలు, ఎక్కువగానో తక్కువగానో తప్పులతో అమెరికాయందు ముద్రింపబడినాయి. బకునినుచే(4) చేయబడిన ప్రథమరష్యను తర్జుమా జెనీవాలో హెర్జనుయొక్క (6) కొలోకోల్' కార్యాలయాననుండి 1863 ప్రాంతాన ప్రకటించబడింది. రెండవరష్యను తర్జుమా వీరయువతి యగు *వీరాజసులిచ్ చే 1882 లో జెనివాలోనే ప్రకటించ బడింది.

డేనిష్ భాషలోని నూతనకూర్పు 1885లో కోపెన్‌హాగెనులో ప్రకటింపబడుచుండిన 'సోషల్ డిమోక్రటిక్ బిబ్లోటిక్' లో కనపడుతూఉంది. ఫ్రెంచిభాషలోని మరియొకనూతన కూర్పు1886లో పారిసునగరములోని "లీసోషలిస్టు"లో ప్రక

---

* ఇదిపొరపాటు. దీనిని తర్జుమా చేసింది ప్లెఖానోవ్. ఇరువురు కూడా రష్యను విప్లవకారులే. రష్యను సోషలిజానికి పితామహుడు ప్లెఖానోవ్.—త.

టించబడింది. ఈ ఫ్రెంచి తర్జుమానుండియే 1886లో మాడ్రిడులో, ఒక స్పానిషు తర్జుమా తయారు చేయబడి ప్రకటించబడింది. జర్మను పునర్ముద్రితాలను లెక్క పెట్టకయే కనీసం ఈ కరపత్రానికి 12 కూర్పులున్నాయి. ఒక ఆర్మీనియను భాషాంతరీకరణం కొన్ని నెలలకు ముందు కాంస్టాంటినోపిలులో ప్రకటితము కావలసింది బయటపడలేదు.

మిగిలిన భాషలలోని అనేక తర్జుమాలను గూర్చి నేను వినియున్నాను. కాని వానిని నేను చూడలేదు. ఇట్లు కమ్యూనిస్టు కరపత్రం యొక్క చరిత్ర ఆధునిక కార్మికతరగతి యొక్క ఉద్యమ చరిత్రనే ప్రతిబింబిస్తూ ఉంది. ప్రస్తుతం, అది సోషలిష్టు వాఙ్మయాన అన్నిటికంటె అధిక అంతర్జాతీయ ప్రచురణమయి అన్నిటికంటె ఎక్కువ వ్యాపకములో ఉంది అనేదానికి సంశయము లేదు. సైబేరియానుండి, కాలిఫోర్నియా వరకుండె కోట్లకొలది కార్మికులచే తమయందరియొక్క కార్యప్రణాళిక అదే అని అంగీకరింప బడుతూ ఉంది.

అయితే, దానిని వ్రాసేటప్పుడు దానికి 'సోషలిష్టు' కరపత్రం అని మేము పేరు పెట్టలేకుంటిమి. 1847లో "సోషలిష్టు"ల నే పేరు ఒకవైపు ఊహాజనిత వివిధ విధానాల ననుసరించే ఇంగ్లండులోని ఓవను (7) అనుయాయులకూ, ఫ్రాంసులోని ఫోరియరు (8) అనుయాయులకూ, వరిస్తూ వుండేది. ఇవి రెండూ అప్పటికే క్షీణించిపోయి కేవలం చిన్న తెగలుగా ఉండి కాలక్రమేణ



నశించిపోయ్యే దశకు వచ్చియుండినవి. అట్లే మరియొకవైపు సోషలిస్టులంటే పెట్టుబడికి, లాభానికి ఎట్టి అపాయమున్నూ లేక అన్నిరకాల సామాజిక సంకటాలనూ, నివారిస్తామని అన్నిరకాలూ అతుకుబొతుకులు వేసి సామాజిక రోగాలను పోగొట్టుతామని ప్రయత్నిస్తూ వుండే వివిధ బూటక చికిత్సకులని అర్థమగుతూ ఉండింది. ఈ ఇరు తెగల్లోని మనుష్యులు కార్మికోద్యమానికి దూరులే. వీరు తమ సహాయుల కొరకు విద్యావంతులగు తరగతులవైపే దృష్టి నిగుడ్చుచుండేవారు. కేవలం రాజకీయ విప్లవాలే చాలవని గ్రహించి సంపూర్ణ సామాజిక మార్పు యొక్క ఆవశ్యకతాన్ని ప్రకటించిన కార్మిక వర్గమందలి ప్రతిభాగము తన్ను కమ్యూనిస్టు అని వ్యవహరించుకొనసాగింది. అది అపరిష్కృతమైన, అప్పుడప్పుడే ఆకారం పొందుచుండే పూర్తిగా స్వాభావికమగు కమ్యూనిజం అయినప్పటికీ, అది ప్రధాన విషయాన్ని గ్రహించిందై ఫ్రాంసులో కాబెట్టు (9) యొక్కయు జర్మనీలో వీట్లింగు (10) యొక్కయు ఊహాజనిత కమ్యూనిజాన్ని కలుగజేసేటంత, దృఢంగా కార్మికవర్గమందు పాదుకొనకల్గింది. ఇట్లు 1847లో సోషలిజం బూర్జువా వర్గపు ఉద్యమం; కమ్యూనిజం కార్మిక వర్గపు ఉద్యమం. సోషలిజం కనీసం యూరపు భూభాగమందైనా మాననీయంగా ఉండేది కాని కమ్యూనిజం పూర్తిగ తద్వ్యతిరేకం. మొట్టమొదటనుండీ "కార్మికుల విముక్తి తప్పక కార్మికుల పనే"

అనే భావంకలిగినవారము కావడంచేత సోషలిజం, కమ్యూని నిజం అనుపేర్లలో దేనిని మేముగ్రహించవలెనో అనే దాన్ని గురించి ఎట్టి సందేహమున్నూ ఉండేదానికి అవకాశం లేకపోయింది. పైగా అప్పటినుండి, ఆపేరుసరియైనది కాదని నిరాకరించేదానిని ఆలోచించను కూడా లేదు.

కరపత్రం మాయిరువురి సంయుక్తకృషిఫలితంగాన, దీనియందలి ముఖ్యాంశానికి ఆధారమగు మూలసిద్ధాంతం మార్క్సుదే అనిచెప్పవలసినవిధి నాయందుఉందని అనుకుంటాను. ఆమూలసిద్ధాంతమిది :— ప్రతిచారిత్రక యుగమందునూ, అప్పుడాచరణలోఉండే ఆర్థికోత్పత్తి విధానమునుండి, మారకవిధానంనుండీ, తప్పనిసరిగా బయలుదేరేటటువంటి సామాజికవ్యవస్థ, ఆయుగంయొక్క రాజకీయవైజ్ఞానికచరిత్ర నిర్మింపబడేదానికి పునాదియు, దానిని విశదీకరించేదానికి ఆధారమును అయిఉంది. అందుచేత మానవజాతిచరిత్రంతా భూమిని సమిష్టి యాజమాన్యాన ఉంచుకొనియుండిన ప్రాథమిక తెగల సమాజంఛిన్నాభిన్నమైన నాలనుండీ వర్గకలహాల చరిత్రయే. అది దోచుకొనే వారికినీ, దోచుకొనబడేవారికినీ, మధ్యచెలరేగే వివాదాలచరిత్రయే. ఈవర్గ కలహాల చరిత్ర పరిణామముల సోపానమే. ప్రస్తుతం ఈ పరిమాణముయొక్క స్థితి ఇది:— దోచుకొనబడే పీడిత వర్గం-శ్రామికవర్గం-దోచుకొనే శాసకవర్గంయొక్క- బూర్జువా



వర్గంయొక్క అధికారమునుండి సమాజమునంతా, అన్ని విధాల దోపిడినుండీ, నిర్బంధాలనుండీ, వర్గభేదాలనుండీ, వర్గకలహాలనుండీ, ఎల్లప్పటికి విముక్తిగావించందే తన విముక్తినికూడ పొందలేదు.

జీవశాస్త్రానికి డార్విను (11) సిద్ధాంత మెట్టిస్థితి కలిగించిందో, ఈ సిద్ధాంతం చరిత్రకు అట్టిస్థితినే కలిగిస్తుందని నా అభిప్రాయం. 1845 కు పూర్వం కొన్ని వత్సరాలగా మేమిరువురమూ దీనిని క్రమేణ అవగాహనం చేసుకుంటూ వస్తూ ఉంటిమి. స్వతంత్రంగా నేనుదానిసర్థము చేసుకోవడంలో ఎంతవరకు ముందుకు సాగియుండింది "ఇంగ్లండులోని కార్మికుల పరిస్థితులు" అనే నా పుస్తకం స్పష్టంగా తెల్పుతుంది. కాని బ్రస్సెల్సునగరాన నేను 1845 సంవత్సరమున వసంత ఋతువులో మార్క్సును తిరిగి కలిసికొనేటప్పటికే ఆయన దానిని పూర్తిగా అవగాహనం చేసుకొని యుండినాడు. ఇచ్చట నేను ఎంతస్పష్టంగా చెప్పియున్నానో దాదాపు అంత స్పష్టంగానే మార్క్సు ఆ సిద్ధాంతాన్ని నాకు అప్పుడు విశదీకరించి ఉండినాడు.

1872 లో ప్రకటితమైన జర్మనీకూర్పుకు, మేమిరువురమూకలసి రచించిన భూమికనుండి, నేనీక్రింది అంశాన్ని ఎత్తి వ్రాస్తున్నాను.

"గత 25 సంవత్సరాలలో పరిస్థితు లెంతమారిపోయిననూ, ఈ కరపత్రంలో ఉదహృతములైన సామాన్యసిద్ధాంతాలు మొత్తముమీద ఎప్పటికివలె నేటికినీ సత్యాలే అయియున్నాయి. బహుశ అచ్చటచ్చట కొన్ని చిన్న విషయాలను మాత్రము మరింత విపులంగా స్పష్టంగా వ్రాయవచ్చును. ఈ సూత్రాల ప్రత్యక్షాచరణం కరపత్రమే చెప్పినట్లు, అన్ని స్థలాలందు అన్నికాలాలందు ఆ సమయాన ఉండే చారిత్రక పరిస్థితులపై ఆధారపడియుంటాయి. అందుచే రెండవ అధ్యాయంచివర సూచించిన విప్లవచర్యలకు ప్రత్యేక ప్రాముఖ్యత ఏమీ ఇవ్వలేదు. ఆభాగం నేడు చాలవరకు బొత్తిగా వేరు విధాన వ్రాయబడియుండేది. 1848 తదుపరి ఆధునిక పరిశ్రమయొక్క అత్యధిక వికాసాన్నిబట్టీ, దానివెనువెంటనే వచ్చే కార్మికులయొక్క విస్తృతమైనట్టి, వృద్ధిగాంచినట్టీ,సంఘటనబట్టీ ; మొదటఫిబ్రివరీవిప్లవమునందు, పిదపఅంతకన్నఎక్కువగా, రెండుమాసాలుపూర్తిగారాజ్యాధికారాన్ని ప్రపంచచరిత్రలోమొదటిసారితమచేతులలో శ్రామికవర్గముంచుకొన్న పారిస్ కమ్యూను(12)యందు పొందినఅనుభవాన్నిబట్టి చూస్తే కార్యక్రమం కొన్ని అంశాలలో ప్రాతదైనది. కమ్యూనువలన ముఖ్యంగా ఒకసంగతి రుజువగుచున్నది..— కార్మికవర్గం తయారుగ ఉన్నప్రభుత్వ యంత్రాన్ని



సులభంగా కైవశంచేసికొని తనపనులకోసం దాన్నివినియోగపరచుకోజాలదు. (ఫ్రాన్సుయందలి అంతఃకలహము: 1871లో అంతర్జాతీయ కార్మిక సమితియొక్క సాధారణ సంఘములో ఇచ్చినఉపన్యాసాన్ని చూడుడు. అందుఈవిషయం ఇంకా విస్తృతంగా వివరింపబడింది.) మరియు, ప్రస్తుతకాలాన్నిబట్టి సోషలిస్టు వాఙ్మయంయొక్క విమర్శన, లోపభూయిష్టమని తెలుపకయే తెలుస్తూఉంది. ఎందుకంటే ఆవిమర్శన 1847 వరకు మాత్రమే అయిఉంది. మరియు ప్రతికక్షులగు తదితర పక్షాలతోటి కమ్యూనిస్టుల సంబంధాలను గూర్చిన సూచనలు సిద్ధాంతరీత్యా, ఇప్పటికినీ సత్యాలేఅయినప్పటికి, రాజకీయస్థితి పూర్తిగా మారిపోవడంచేత ఆచరణరూపేణ పురాతనమైపనికిమాలినవైఉన్నవి. అందుకు మరియొక కారణం అచ్చట ఉదహృతములైనరాజకీయ పక్షాలలో ఎక్కువవాటినిప్రపంచాన లేకుండ చారిత్రకాభివృద్ధి చేసివేసింది.

"అయితే, ఈ కరపత్రం చారిత్రిక పత్రమైపోవుటచే దానియందుమార్పులుచేసేదానికిమాకింకఎట్టిహక్కునూ లేదు"

మార్క్సు "కాపిటల్"లో చాలభాగం తర్జుమాచేసిన సామ్యుయల్ మూరుగారిచే చేయబడిందీభాషాంతరీకరణం. మేమిరువురమూకలసియే దీనియందు తప్పొప్పుల సరిచూచి

యున్నాము. చారిత్రికసూచనలను విశదము చేసేదానికి కొన్ని టీకల నేను చివర చేర్చియున్నాను.

ఫ్రెడరిక్ ఎంజిల్సు,

లండను 30 జనవరి 1888.



# కమ్యూనిస్టు కరపత్రం.



యూరపును ఒకపిశాచంసోకిఉంది. ఆపిశాచమే కమ్యూనిజం. పురాతనయూరపునందుండే శక్తులన్నీ (ప్రభుత్వాలన్నీ) ఒకే పవిత్ర సమాశ్రియంగా ఈపిశాచాన్ని మంత్రాలతో తోలివేసేదానికి ఏర్పడియున్నాయి. వారు పోపు, జారు, మెట్టిర్నిచ్, (13) గ్యూజాట్, ఫ్రెంచి అతిఉదారవాదులు, జర్మను పోలీసుగూఢచారులు.

అధికారమునందుండే పక్షంచేత వాని ప్రతిపక్షులు, కమ్యూనిస్టులని నిందింపబడకుండింది యెక్కడ? ప్రభుత్వాన్ని ఎదిరించేపక్షం తనకన్న అభివృద్ధికారులైన తదితర వ్యతిరేక పక్షాలనూ అట్లనే తనకన్నసంకుచితపక్షాలను కమ్యూనిజమనే నిందకు గురిచేయంది ఎక్కడ?

ఈ సంగతివలన రెండువిషయాలు తెలుస్తూ ఉన్నాయి.

1. యూరపుశక్తు లన్నిటిచేతనూ కమ్యూనిజంకూడ ఒకశక్తి అని అంగీకరింపబడివుంది.

2. ప్రపంచమంతా వ్యతిరేకమైననూ, తమ భావాలను, తమ ఆదర్శాలను, తమ పోకడలను బహిరంగంగా

కమ్యూనిస్టులు ప్రకటించాల్సిన కాలం వచ్చింది. కమ్యూనిస్టు పిశాచం అనే ఈ పుక్కిటి పురాణగాథను పార్టీయొక్క కరపత్రాన్ని ప్రకటించి మాపుచెయ్యాలి.

ఈ వుద్దేశంతో వివిధ దేశాలకు చెందిన కమ్యూనిస్టులందరూ, లండనునగరములో కలిసికొని, ఈ కరపత్రాన్ని ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, ఫ్లెమిష్, డేనిష్ భాషలలోకి ప్రకటింపబడేదానికి చూచాయగ తయారుచేశారు.



# అధ్యాయం ఒకటి

## బూర్జువా శ్రామికులు (14)

ఇంతవరకుండే సామాజిక (15) చరిత్రంతా వర్గకలహాలచరిత్రే.

స్వతంత్రుడు, బానిస; కులీనుడు, సామాన్యవంశజుడు, ప్రభువు, దాసుడు; శ్రేణియందలి స్వతంత్రవ్యక్తి, కూలివ్యక్తి వేయేల, పీడించేవాడు పీడితుడు ఎడతెగనికక్షతో ఒకరికి వ్యతిరేకంగా మరియొకరు, ఆపకుండా, ఒకసారి బహిరంగంగా, మరియొకసారి రహస్యంగా, కలహించుకుంటూనే ఉండినారు. ఈ కలహం ప్రతిసారి సమాజాన్నంతా విప్లవకరంగా పునర్నిర్మించేదానితోనైనా పూర్తిఅయ్యేది; లేదా వివాదగ్రస్తులగు ఇరుతెగలయొక్క సమాన నాశనంతోనైనా పూర్తి అగుతూవచ్చింది.

చరిత్రయొక్క ప్రప్రథమ యుగాలలో, వివిధ పరంపరలగా, సాంఘికహోదానుబట్టి మిక్కిలి తారతమ్యంగలదిగా ఉండిన అతిక్లిష్టమగు సామాజికవ్యవస్థ సర్వత్రా మనకుకనపడుతూవుంది. ప్రాచీనరోము సామ్రాజ్యంలో కులీనులు, బిరుదాంకితులగుశూరులు, సామాన్యవంశజులు, బానిసలు ఒకరి

క్రింద ఒకరు సాంఘికవ్యవస్థయందు స్థానాలు ఆక్రమించుకొని ఉండేవారు. మధ్యయుగంలో, జమీందారీ ప్రభువులు సామంతులు, శ్రేణియందలి స్వతంత్రవ్యక్తి, శ్రేణియందలికూలీ, పారిశ్రామికఅభ్యాసకులు, దాసులు వరుసగా పైనుండిక్రిందను ఉండేవారు. దాదాపు ఈ అన్ని తెగలందూ, తిరిగి ఉపతెగలు ఇట్లే సోపానక్రమం కలిగి ఉండేవి.

జమీందారీ సమాజంయొక్క వినాశంనుండి ఉద్భవించిన ఆధునిక బూర్జువాసమాజం, వర్గస్పర్థలను, రూపుమాపలేదు. అదినూతనవర్గాలను, పీడించుటకు నూతన పరిస్థితులనూ, కలహానికి నూతన రూపాలనుమాత్రమే, పాతవాని కి బదులు కల్పించింది.

అయినా బూర్జువాయుగమగు మన యుగానికి ఈ ప్రత్యేక లక్షణంఉంది:—అది వర్గస్పర్థలను స్పష్టంజేసింది. సమాజాన్నంతా మొత్తముమీద రానురాను రెండు గొప్ప వ్యతిరేకపక్షాలలోకి చీలుస్తూఉంది. ప్రత్యక్షంగా ముఖాముఖిని నిలువబడిఉండే రెండుమహాతెగలుగా సమాజమంతా చీలుతూఉంది. ఆ తెగలే బూర్జువా శ్రామిక వర్గాలు.

మధ్యయుగమునందుండిన దాసులనుండే, మొట్టమొదటి పట్టణాలలో ప్రత్యేకాధికారలుపొందిన(16)పురనివాసులు తయారైనారు. ఈ పురవాసులనుండే బూర్జువావర్గంయొక్క ప్రథమ అంశాలు వృద్ధిపొందాయి.



అమెరికాను కనుగొనడమూ, కేపు అగ్రమును (దక్షిణాఫ్రికాకొనను- తర్జుమాదారుడు) చుట్టిరావడం, అప్పుడే పైకివచ్చుచుండే బూర్జువా వర్గానికి నూతనక్షేత్రాన్ని కలిగించాయి. చైనా, తూర్పు ఇండియా దీవులలోని మార్కెట్టులు అమెరికాను వలసరాజ్యంగా చేయడం, వలసరాజ్యాలతోటి వ్యాపారం, మొత్తంమీద మారక విధానాలలోను వర్తకపు సరకులందును కలిగిన అభివృద్ధి, వ్యాపారానికి, నౌకాయానానికి పరిశ్రమలకు అదివరకెప్పుడునూ, కనివినియెరుగని ప్రోత్సాహమిచ్చింది. తద్వారా జీర్ణీభూతమయ్యే జమీందారీ సమాజమందు ఉండే విప్లవఅవకాశాలకు శీఘ్రాభివృద్ధిని చేకూర్చింది.

జమీందారీ పారిశ్రామిక విధానంలో పారిశ్రామికోత్పత్తి ఇతరులకు చొరనలవిగాని శ్రేణులచేత (16అ) గుత్తకు తీసుకొబడి ఉండడముచేత ఆవిధానం నూతనమార్కెట్టులలో రోజుకు రోజు వృద్ధిపొందుచుండే గిరాకికి సరఫరా చేసే దానికి పనికిరాకపోయింది. దాని స్థానాన్ని చేతియంత్రాలతో తయారుచేసే విధానం ఆక్రమించుకొంది. శ్రేణులయందలి స్వతంత్ర వ్యక్తులను మధ్యతరగతికిచెందిన చేతియంత్రాధికారులు వెనక్కి నెట్టివేశారు. ప్రతికర్మాగారమందలి శ్రమవిభాగంముందు, నియమాలచే కట్టుపడిన వివిధశ్రేణుల మధ్య ఉండిన శ్రమవిభాగము నిలువజాలక మాయమైపోయింది.

ఈలోపల మార్కెట్టులు ఎడతెగక వృద్ధిపొందుతునే ఉండినవి. గిరాకికూడ ఎడతెగక హెచ్చుతూనే ఉండింది. చేతియంత్రవిధానంకూడ చాలకపోయింది. అందుమీద, ఆవిరి, యంత్రాలు పారిశ్రామికోత్పత్తియందు విప్లవాన్ని తెచ్చిపెట్టాయి. చేతియంత్రాలస్థానం బ్రహ్మాండమగు ఆధునిక పరిశ్రమలచేతనూ; పారిశ్రామిక మధ్యతరగతుల స్థానం పారిశ్రామిక కోటీశ్వరులున్నూ, పారిశ్రామిక సైన్యనాయకులున్నూ అగు ఆధునిక బూర్జువావర్గం చేతనూ ఆక్రమించబడ్డాయి.

ఆధునికపరిశ్రమలు ప్రపంచమార్కెట్టును నెలకొల్పాయి. దానికిమార్గంతీసిందిఅమెరికానుకనుక్కోవడమే. ఈమార్కెట్టు వాణిజ్యానికి నౌకాయానానికీ నేలయందలి రాకపోకలకీ అత్యధిక వికాసాన్ని కలుగజేసింది. ఈ అభివృద్ధి తనవంతు వచ్చినప్పుడు, పరిశ్రమాభివృద్ధి కలిగేటట్లు తోడ్పడింది. పరిశ్రమలు నౌకాయానం రైలుమార్గాలు ఎన్నింతలు ఎక్కువయ్యాయో అన్నింతలే బూర్జువావర్గంకూడ అభివృద్ధిగాంచింది. తన పెట్టుబడిని వృద్ధిపొందించుకుంది. మధ్యయుగాన నుండీ వచ్చుచుండిన ప్రతితెగను అప్రధానం గావించి వెనక్కినెట్టింది.

కాన ఆధునిక బూర్జువావర్గంకూడ దానిమట్టుకు అది దీర్ఘకాలాభివృద్ధి ఫలితమే అనిన్నీ, ఉత్పత్తివిధానాలందు



మారకవిధానాలందూ కలిగినవిప్లవపరంపరల ఫలితమే అనిన్నీ మనము చూస్తూఉన్నాము.

బూర్జువావర్గముయొక్క అభివృద్ధిననుసరించి దాని రాజకీయాభివృద్ధికూడ వికసిస్తూ వచ్చింది. జమీందారీప్రభువుల శాసనంలోపీడితవర్గంగావుండి మధ్యయుగపు(17)కమ్యూనులందు స్వపరిపాలనంతో ఆయుధధారియైన సమితిఅయింది. కొన్ని స్థలాలలో జర్మనీ ఇటలీలలోవలె స్వతంత్రపట్టణప్రజాస్వామికాలగా, మరికొన్నిస్థలాలలో ఫ్రాంసువలె రాజరికానికి పన్ను చెల్లించవలసిన మూడవజాతిగా (18)వుండేవి. పిమ్మట చేతి యంత్రాలకాలములో సగం జమీందారీస్వభావంగల రాజరికానికో లేక నిరంకుశ రాజరికానికో జమీందారీ ప్రభువులకు వ్యతిరేకంగా జమీందారీ ప్రభువులకు సమప్రతిద్వందులుగా నిలచి సాయము చేస్తూవచ్చాయి. నిజానికి, ఆఖరకు ఆధునికపరిశ్రమ ప్రపంచమార్కెట్టును ఏర్పరచినమీదట ఆధునిక ప్రతినిధి సత్తాకమందు పూర్తిగా రాజ్యాధికారాన్ని తనకోసమే వశపర్చుకుంది. ఆధునిక ప్రభుత్వంయొక్క కార్యనిర్వాహక వర్గం బూర్జువావర్గంయొక్క సర్వసాధారణ విషయాలను నిర్వహించే కమిటీయే.

చరిత్రలో బూర్జువావర్గం సర్వోత్కృష్టమయిన విప్లవ పాత్రను ధరించింది.

బూర్జువావర్గం పైచేయి అయిన ప్రతిస్థలమందూ అది (19) జమీందారీ పైతృక పౌరోహిత ప్రథలను అంతమొందించింది. మానవుని అతని "స్వభావిక పెద్దల" (!) క్రింద పడి ఉండేటట్లు బంధించిఉండిన అన్నిరకాల బంధాలను నిర్దాక్షిణ్యంగా త్రెంపివేసింది. ఒకమానవునితో మరియొక మానవుని యొక్క సంబంధం కేవలం వానిస్వలాభం వాని హృదయ విహీనమైన పైసాసంబంధము మీద ఆధారపడేటట్లు చేసింది. అది మతౌత్సుక్యంయొక్క పారవశ్యతలనూ ఔదార్యసాహసాది గుణాలమూలంగా కలిగే ఉత్సాహాన్నీ, అనాగరికులకు సహజమయిన భావౌత్సుకతాన్నీ స్వలాభం అనే మంచు నీటిలోముంచి కొయ్యబారునట్లు చేసింది. అది వ్యక్తి విలువను మారకపు విలువగా మార్చివేసింది. అధికార పత్రాలద్వారా కొనుక్కోబడినట్టి అడ్డగింపరానట్టి, లెక్కలేనన్ని స్వతంత్రాలకుమారుగా తర్కవిరుద్ధమయిన మొగమాటంలేని స్వేచ్ఛావాణిజ్యమనే ఒకేస్వతంత్రాన్ని నిలబెట్టింది. వేయేల ముక్తసరిగా చెప్పవలసివస్తే అది మత రాజకీయ కనుగంతల మాటున జరుగుచుండే దోపిడికి బదులు దయ, లజ్జ, లేని కేవల ప్రత్యక్ష దోపిడిని అవలంబించింది.

బూర్జునావర్గం, ఇదివరకు భయంతో గౌరవింప బడుచుండే ప్రతిపనియందు ఉండే వ్యర్థపూజ్య భావాన్ని నాశనం చేసింది. వైద్యునీ, న్యాయవాదినీ, మతగురువున్నూ, కవినీ, శాస్త్రజ్ఞునీ, తనజీతపు కూలీలగా మార్చివేసింది.



బూర్జువావర్గం కుటుంబాన్ని కప్పియున్న భావోద్రేకమనే తెరను తుత్తునియలు కావించింది. కుటుంబాన్ని కేవలం ధనంమీద ఆధారపడే సంబంధంగా చేసివేసింది.

పురాతనవాదులు అమితంగా ప్రశంసించే మధ్యయుగమందలి నిర్దాక్షిణ్యశక్తి ప్రదర్శనం కడకు అత్యంత సోమరితనానికి ఎట్లుదారితీసిందో బూర్జునావర్గం వెల్లడించింది. మానవుని కృషి ఏమేమి చేయగలిగింది మొదటచూపింది అదే. ఈజిప్టునందుండే పిరమిడ్లు, రోమనుకాలువ, (20) గోథిక్ చర్చి భవనాలను మించిన అద్భుతకార్యాలను పూర్తి కావించింది. పూర్వపు జాతుల వలస యాత్రలు, పూర్వపు మత యుద్ధాలు, కొరగానివిగాచేసే దండయాత్రలను సాగించివుంది.

ఉత్పత్తిపరికరణాలలో ఎప్పుడూ విప్లవాన్ని కలిగిస్తూ ఉండకపోతే బూర్జువావర్గం తనఆస్తిత్వాన్ని నిలుపుకోలేదు. ఈఉత్పత్తి పరికరణాలలోని విప్లవం ఉత్పత్తివిధానంలోని సంబంధాలను, వానితోపాటు, సమాజమునందలి సంబంధాలను అన్నిటినీ మార్చివేస్తుంది. అంతకు ముందటి పారిశ్రామికవర్గాల అస్తిత్వానికి ప్రథమషరత్తు పురాతన ఉత్పత్తి విధానాలు మార్పుజెందక ఉండడమే. ఉత్పత్తిలోని ఎడతెగని విప్లవం; సామాజిక పరిస్థితులలోని ఎడతెగని కదలిక, ఎడతెగని అనిశ్చయం ఎడతెగని అలజడి; బూర్జువాయుగాన్ని

దానికిముందుండినయుగాలనుండిప్రత్యేకిస్తూఉన్నవి. దృఢంగా నాటికొని ఘనీభవించిపోయిన సంబంధాలన్నీ వాని ననుసరించి ఉండే పురాతన పూజ్యాభిప్రాయాలన్నీ పూజ్యదురభిప్రాయాలన్నీ తుడిచివేయబడ్డాయి. క్రొత్తగాఏర్పడిన సంబంధాలన్నీ అభివృద్ధికి ప్రతిబంధకాలుగా స్థిరంగా పాదుకొనేదానికి మునుపే పనికిమాలినప్రాతచెత్తై పోతున్నాయి. స్థిరమైనదనుకొన్నది గాలంలో కలసిపోతూ వుంది. పవిత్రమైనవని అనుకొన్నవన్నీ అపవిత్రాలగుతూ ఉన్నాయి. కడకు మానవుడు తనయింద్రియశక్తులను స్థిరంచేసుకొని తన జీవితంలోని నిజపరిస్థితులనూ తనజాతితోటి తనసంబంధాన్ని గూర్చి నిదానంగా ఆలోచించేటట్లు నిర్బంధింపబడుతూ ఉన్నాడు.

తన వస్తువుల విడుదలకొరకు ఎప్పుడూ విస్తరిస్తూవుండవలసిన మార్కెట్టుయొక్క అవసరం బూర్జువావర్గాన్ని ప్రపంచమంతా పరుగెత్తేటట్లు చేస్తూవుంది. అది ప్రతిచోట సందుచేసుకోవాలి. ప్రతిచోట నివాస మేర్పరచుకోవాలి. ప్రతిచోట సంబంధాలు స్థాపించుకోవాలి.

బూర్జువావర్గం ప్రపంచపు మార్కెట్టును దోచుకొనడంలో ప్రతిదేశమందు, ఉత్పత్తివినియోగాలకు విశ్వైక్యతాభావ మాపాదించింది. పురాతన వాదులకు కోపం అసంతోషం ఎక్కువయ్యేటట్లు పరిశ్రమయొక్క దేశీయ స్వభావాన్ని తొలగించింది. చాలకాలం క్రితం స్థాపించబడిన



దేశీయపరిశ్రమలన్నీ ధ్వంసముజేయ బడ్డాయి. లేదా చేయబడుతూ ఉన్నాయి. అవి నూతన పరిశ్రమలచే తమస్థానాలనుండి తొలగించబడ్డాయి. ఈనూతన పరిశ్రమల స్థాపన నాగరిక రాష్ట్రాలకంతా జీవన మరణ సమస్యగ పరిణమించింది. దేశీయపదార్థాలను ఇవి ఉపయోగించక, చాలదూర ప్రాంతాలనుండి తేబడే ముడివస్తువులచేతనే తమపనిని సాగిస్తూ ఉన్నాయి. ఈపరిశ్రమలచే తయారుచేయబడే వస్తువులు స్వదేశమందేగాక ప్రపంచమంతా, మారుమూలలందునూ ఉపయోగింపబడుతూఉన్నాయి. దేశీయోత్పత్తిచే తృప్తిచెందే ప్రాతవాంఛలస్థానాన, నూతనకోరికలు బయలుదేరడం చూస్తూఉన్నాము. వీనిని తృప్తిపరచేదానికి దూరదేశాలనుండీ వేరేశీతోష్ణాలుగల ప్రదేశాలనుండీ, సరకు రావలసి ఉంది. ప్రాచీన స్థానిక, దేశీయప్రత్యేకతకుమారుగా స్వయంసంపూర్ణతకుమారుగా, అన్నివైపులా సంబంధాలు కలిగిఉన్నాము. దేశాలన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయి. పాదార్థికంగా ఎట్లో, అట్లే విజ్ఞానోత్పత్తియందు గూడ అవినాభావసంబంధం ఉంది. ఒకదేశంయొక్క వైజ్ఞానిక సృష్టి అన్నిదేశాల సామాన్యసొత్తు అగుతూఉంది. జాతీయ పక్షపాతం, సంకుచిత్వం రానురాను అసంభవమగుతుంది. లెక్కలేని దేశీయ, స్థానికవాఙ్మయాలనుండి విశ్వవాఙ్మయం ఉద్భవిస్తూఉంది.

ఉత్పత్తి పరికరణాలన్నిటియొక్క శీఘ్రాభివృద్ధివలనా, అత్యధికంగా ప్రయాణాలను సులభంచేసిన రాకపోకల సాధనాలవలనా, అన్నిదేశాలను, అత్యధిక అనాగిరిక జాతులను కూడ, నాగరికతలోకి బూర్జువావర్గం దింపుతూవుంది. ఈనాగరికతకు లొంగేదానికి అడ్డంకిఅయిన అనాగరికులకు విజాతీయులందుండే మొండివిద్వేషాన్ని, మరితర చీనాదేశపు గోడలవంటి అడ్డంకులనూ, తన వ్యాపారసరకులను చౌకగాఅమ్మి నాశనమొనరిస్తూఉంది. తాముజీవించి ఉండాలనుకుంటే అన్ని జాతులూబూర్జువాఉత్పత్తివిధానాన్ని,తప్పకఅనుసరించేలాగు చేస్తూవుంది. అదితాను నాగరికత అనిపిలిచేదాన్ని, తమమధ్యనుకూడ వారు ప్రవేశపెట్టుకొనేటట్లు చేస్తూంది. అంటే, వారుకూడ బూర్జువాగా మారేటట్లుచేస్తుంది. ముక్తసరిగా చెప్పమంటె, అదితన ప్రపంచమువంటి ప్రపంచాన్ని సృజిస్తూ ఉంది.

బూర్జువావర్గం గ్రామాలను నగరశాసానికి లోబరిచి ఉంది, అది గొప్పగొప్ప నగరాలను సృష్టించింది. గ్రామజన సంఖ్యతో పోల్చిచూస్తే నగర నివాసులసంఖ్య చాల ఎక్కువగా వృద్ధిపొందేటట్లు చేసింది. ఈవృద్ధిమూలంగానే జనసంఖ్యయందు ఎక్కువభాగం గ్రామ జీవనంయొక్క మూఢత్వాన నుండి తప్పించుకోగలిగింది. పట్టణాలపై గ్రామాలాధారపడేటట్లు చేసింది. అట్లనే అనాగరికదేశాలు స్వల్పనాగరికతగల



దేశాలు నాగరికతగల దేశాలపై అధారపడేటట్లు చేసింది. అట్లే రైతుదేశాలు బూర్జువాదేశాలమీదనూ తూర్పుదేశాలు పాశ్చాత్యదేశాలమీదనూ, అధారపడేటట్లు చేసింది.

రానురాను, బూర్జువావర్గం జనులు చెల్లాచెదరుగా నివసించడాన్ని, వుత్పత్తి పరికరణాలు, ఆస్తి. చెల్లాచెదరుగా ఉండడమును, మాన్పుతూ వస్తూవుంది. ఒకచోట కలసి నివసించేజనులు, కేంద్రీభూత ఉత్పత్తివిధానం, కొలదిమంది చేతులలో చేరియుండు ఆస్తి, ఇవియే దాని లక్షణాలు. దీని పర్యవసానం తప్పనిసరిగా రాజకీయ కేంద్రీకరణం, ప్రత్యేక లాభాలు, ప్రత్యేకచట్టాలు, ప్రత్యేకప్రభుత్వాలు, ప్రత్యేక శిస్తువిధానాలు, కలిగఉండే స్వతంత్ర ప్రాంతాలు; పేరుకు మాత్రం ఐక్యతకల ప్రాంతాలు; ఒకేవర్గమునకు చెందినను జాతీయములనబడేలాభాలు,ఒకేసరిహద్దు ఒకేసుంకాలవిధానం కల ఒకేప్రభుత్వంక్రింద, ఒకేచట్టముక్రింద, ఒకేజాతిగా చేయబడ్డాయి.

నూరుసంవత్సరాలుకూడ నిండీనిండని బూర్జువాశాసన కాలంలో అది అంతకు ముందటి తరాలన్నీ కలసి నిర్మించజాలని బ్రహ్మాండమగు దృఢఉత్పత్తి శక్తులను సృజించింది. ప్రకృతియొక్క శక్తులను మనుష్యునికి అధీనం కావించడం; యంత్రాలు; పరిశ్రమలయందూ, వ్యవసాయమందూ

రసాయనశాస్త్రప్రజ్ఞానాన్ని వినియోగించడం; ఆవిరిచే నౌకాయానం; రైలుమార్గాలు; విద్యుచ్ఛక్తిచే పంపబడే తంతిసమాచారాలు; ఖండాలు ఖండాలనే వ్యవసాయంకోసం తయారుచేయడం; నదులను కాలువలుగాచేయడం; నేల ఈనిందో అన్నట్లు జనసంఖ్యాభివృద్ధి: ఏతొలిశతాబ్దమయినా ఇట్టి ఉత్పత్తి శక్తులు సామాజిక కృషియందు దాగికొని ఉన్నవని కలలోనైనా ఊహించి ఉండిందా ?

బూర్జువావర్గముయొక్క అభివృద్ధికి పునాదియైన మారకవిధానం, వుత్పత్తివిధానం, జమీందారీ సమాజంలో కల్పించబడ్డవని మనము చూస్తూఉన్నాము. ఈమారక ఉత్పత్తి విధానాల అభివృద్ధిలో ఒకానొక దశయందు జమీందారీ సమాజపు ఉత్పత్తి మారక పరిసరాలూ, జమీందారీ వ్యవసాయపు ఏర్పాటులూ, జమీందారీ యంత్రపరిశ్రమ, ముక్తసరిగా, జమీందారీ ఆస్తి సంబంధాలు ఉత్పత్తిశక్తులయొక్క అప్పటి అభివృద్ధినే ఉపయోగించుకొనేదానికి అనుకూల పరిస్థితులను కలుగజేయజాలకపోయాయి. అవి యన్నీ అన్ని సంకెళ్ళయ్యాయి. అవి త్రెంచివేయబడవలసి ఉండినవి. అట్లే అవి త్రెంచివేయబడ్డాయిగూడ. జమీందారీ పరిస్థితుల స్థానాన స్వేచ్ఛాపోటీవచ్చింది. దీనితోపాటు దీనికనుకూలమైన సామాజిక రాజకీయ శాసన పరిపాలిక, బూర్జువావర్గంయొక్క ఆర్థిక రాజకీయాధికారం వచ్చినాయి.



అటువంటి ఉద్యమమే మరియొకటి మనకండ్లయెదుటనే సాగుతూఉంది. ఆధునిక బూర్జువాసమాజం తనఉత్పత్తి సంబంధాలతో, మారకసంబంధాలతో, ఆస్తి సంబంధాలతో చాలగొప్పఉత్పత్తి మారకవిధానాలను, మంత్రశక్తిచే వృద్ధిపొందించిందేమో అన్నట్లు వృద్ధిపొందించి ఉంది. కాని భూతప్రపంచాన్నంతా తనమంత్రశక్తిచే సాక్షాత్కరించేటట్లు చేసిన మాంత్రికుడు, దానిశక్తిని అధీనముంచుకోజాలక పోయినట్లే, ఈబూర్జువా సమాజంకూడ తానునిర్మించిన ఈఉత్పత్తిమారకవిధానాలను తనవశమందుంచుకోలేకపోతూ ఉంది. గతఅనేకదశాబ్దాలగా, పరిశ్రమవాణిజ్యాలచరిత్రఆధునిక ఉత్పత్తిపరిస్థితులకు వ్యతిరేకంగా, బూర్జువావర్గం యొక్కయు దానిశాసనం యొక్కయు అస్తిత్వానికి తప్పనిసరియగు ఆస్తి సంబంధాలకు వ్యతిరేకంగా, జరుగుచుండే తిరుగుబాటుల చరిత్రే. నిర్ణీతసమయాన తప్పకతిరిగివచ్చే ఆర్థికక్షోభలు, బూర్జువాసమాజమంతటి అస్తిత్వాన్ని రానురాను, నిశ్చయంగా సంశయాస్పద మొనరిస్తూ వున్నాయి అనేసంగతినే దీనికి తార్కాణంగా తెలిపితేచాలు. ఈక్షోభలలో ప్రస్తుతం వున్న పదార్థాలలో అధికభాగాన్నేకాక ఆవరకే సృజింపబడి వుండే వుత్పత్తి శక్తులనుగూడ సమయసమయాలందు నాశనం చేస్తూవున్నారు. ఈక్షోభలలో ఒక అంటువ్యాధి వ్యాపిస్తూ వుంది. ఈ అంటువ్యాధి అంతకు ముందటియుగాలలో అసంగ

తంగా కనిపడి వుండేది. దీనిపేరే "అధికోత్పత్తి" అంటువ్యాధి సమాజం తాత్కాలికపశుత్వస్థితియందుంచబడినట్లు ఆకస్మికంగా కనుగొంటుంది. జీవితానికి కావలసినప్రతివస్తువుయొక్క సరఫరా కరువువలనో సర్వత్రవ్యాపించిఉండేయుద్ధమువలననో ఆపివేయబడ్డట్లు కనపడుతుంది. పరిశ్రమ, వాణిజ్యం, నాశనం, కావించబడ్డట్లు గోచరిస్తుంది. ఇదంతా ఎందుకని ? ఎందుకనగా అమితనాగరికతఉండడంచేత! అమిత జీవనోపాధులుండడంచేత! ఎక్కువ పరిశ్రమలు, ఎక్కువ వాణిజ్యం ఉండడంచేత! సమాజంయొక్క ఆధీనంలోఉండే ఉత్పత్తిశక్తులు బూర్జువాఆస్తికి అనుకూలమైన పరిస్థితులను పెంపొందించేదానికి ఇక ఎంత మాత్రము వుపయోగపడవు. పైగా ఈపరిస్థితులచేత బంధించబడివుండే ఆశక్తులు ఈపరిస్థితులకు అలవికాకుండా వుండునంత బలిష్టాలైపోయాయి. ఈ బంధనాల తెంచివేసినతోడనే బూర్జువా సమాజమునందంతటా సంక్షోభాన్ని వ్యాపింపచేస్తాయి. బూర్జువాఆస్తియొక్క ఆ స్థిత్వాన్ని ఆపదలో తోస్తాయి. బూర్జువాసమాజంయొక్క పరిస్థితులు దానిచే సృజింపబడివుండే సంపదను తనలో ఇమిడ్చుకోలేనంత ఇరుకైనవి. యీబూర్జువావర్గం ఈక్షోభలనుండి ఎట్లు బయటపడుతూఉంది ? ఒకవైపు వుత్పత్తిశక్తులను నాశనం చేయడంచేత మరియొకవైపు నూతన మార్కెట్టులను సంపాదించుకోవడంచేత పాతమార్కెట్టులను మరింత పూర్తిగా దోచుకో



డానికి ఏర్పాట్లు పూర్తిచేయడంచేత. అంటే ఇంకను వ్యాపకములైన నాశనకరములైన క్షోభలను దారితీయడంచేత క్షోభలు రానివ్వకుండా చేసుకొనే వుపాయాలు తక్కువయ్యేటట్లు చేయడంతో ఇది బయటపడుతూవుంది.

బూర్జువావర్గం జమీందారీవిధానాన్ని ఏఆయుధాలతో నేలమట్టంజేసిందో, ఆ ఆయుధాలే బూర్జువావర్గంమీదనే తిరిగి ఎత్తబడిఉన్నాయి.

కేవలం బూర్జువావర్గం తనకు చావుకలిగించే ఆయుధాలనేగాక, ఆ ఆయుధాలను ఉపయోగించ వలసియున్న మనుష్యులనుకూడ కల్పించి ఉంది. వారే ఆధునికకార్మికజనం-శ్రామికులు.

ఎన్నింతలు బూర్జువావర్గంయొక్క పెట్టుబడి వృద్ధిజెందిందో, అన్నింతలే శ్రామికవర్గం, ఆధునిక కార్మికవర్గం, వృద్ధిపొందిఉంది. తమశ్రమ పెట్టుబడిని వృద్ధి చేసేటంతకాలమే పనిని సంపాదించుకోగల ఈకార్మిక వర్గం ఆపని దొరుకువన్నాళ్ళే జీవించగలరు. ఈకూలీలు తమ్ము ఏరోజు కారోజు అమ్ముకోవలసి వుంటుంది. అందుచే, *కూలీకూడ, వాణిజ్యమునందలి తదితర ప్రతివస్తువు వలెనే వర్తకపుసరకే అయినాడు.

---

* ఇచ్చట "కూలీ" అనగా మార్క్సు అభిప్రాయం కూలీయొక్క "శ్రమశక్తి" అనియే.—త.

అందుచే పోటీయొక్క మార్పులకు, మార్కెట్టుయొక్క హెచ్చుతగ్గులకు అధీనమయి ఉన్నారు.

చాలఎక్కువగా యంత్రాలను ఉపయోగించుట చేతను, శ్రమవిభాగంచేతనూ, శ్రామికులయొక్క పని తన వ్యక్తిత్వాన్ని గోల్పోయింది. అందుచే కార్మికునిమనస్సునకు సంతోషం కలిగించేశక్తిని కూడఅది గోల్పోయింది. కార్మికుడు యంత్రాలకంటిపెట్టుకొని కేవలం అనుబంధంగా మాత్రమే ఉంటున్నాడు. అత్యంతసామాన్యమైనట్టి విసుగు ఎక్కువగా పుట్టించేటట్టి, అమితసులభంగా సంపాదించుకో బడగలగినట్టి నేర్పునే అతడు చూపాలసి ఉంటుంది. అందుచేత, ఒకకూలీని తయారుచేసే దానికయ్యేఖర్చు, అతడుజీవించేదానికి కావలసిన జీవనోపాధికీ, అతనిజాతిని శాశ్వతంగా ఉండేలాగున అతడు బిడ్డలుకనేదానికీ, కావలసిన కనీసపు మొత్తమనియే నిర్ణయించ బడిఉంది. అయితేఒక వర్తకపుసరకుయొక్క ఖరీదు, దానిని తయారుచేసేదానికయ్యేఖర్చు. అందుచేత కూలీ కూడ వర్తకపు సరుకగుటచేఅతనిఖరీదు అతనిని తయారు చేసేదానికగుఖర్చే. అందుచే పని ఎంతఅసహ్యమగుతూఉందో జీతమంతతక్కువగుతూఉంది. అంతేకాదు. యంత్రాలయొక్క వినియోగము, శ్రమవిభాగము, ఎక్కువయ్యేకొలది పనిభారం కూడఎక్కువగుతూఉంది. ఈభారం, పనిచేసేగంటలను ఎక్కువచేసే దానివలనగాని, ఒకనియమితకాలంలో నిర్బం



ధంగా చేయవలసిన పనిని ఎక్కువచేయడం చేతగాని యంత్రాలయొక్క వేగం ఎక్కువకావడంచేతకాని, అధికంకావచ్చు.

ఆధునిక పరిశ్రమం; పూర్వకాలపు పైతృకయజమాని యొక్క చిన్న కార్మాగారాన్ని పారిశ్రామిక పెట్టుబడిదారుని యొక్క గొప్ప యంత్రాగారంగా మార్చివేసింది. యంత్రాగారంలో గుమిగూడు కూలీలసమూహాన్ని సైనికుల వలెనే సంఘటితం చేస్తూవున్నారు. పారిశ్రామిక సైన్యంలోని సామాన్యసిపాయిల నందరినీ, పైవుద్యోగస్థులు, క్రిందివుద్యోగస్థులుగల ఒకపూర్తి అంతస్తువారీ విధానంయొక్క అధికారాన ఉంచారు. వారు కేవలం బూర్జువావర్గంయొక్క, బూర్జువాప్రభుత్వం యొక్క బానిసలు మాత్రమేకాదు. వారు ప్రతిరోజూ, ప్రతిగంటా, యంత్రాలచేత, మేస్త్రీలచేత, అందరికన్న ఎక్కువగా ప్రతిబూర్జువా యంత్రాధికారిచేత, బానిసగా చేయబడుతూవున్నారు. ఈ నిరంకుశాధికారం తన ఉద్దేశం తన పరమావధి, 'లాభమ'ని ఎంత ఎక్కువగా వెల్లడిస్తుందో అంత నీచముయిందిగా, అంతఅసహ్యమయిందిగా, అంతవ్యథను కలిగించేదిగా, అగుతూవుంది.

ఆధునిక పరిశ్రమ అభివృద్ధిఅయ్యేకొలది, మనుష్యుడు చెయ్యాలసిన పనికి బలం, నేర్పు ఎక్కువగా ఉండవలసిన అవసరం లేకపోతూవుంది. అందుచే పురుషులకు బదులు స్త్రీలు పనులకుపయోగించుకో బడుతున్నారు. వయస్సు

నందుండే భేదాలు స్త్రీ పురుష భేదాలు కార్మికవర్గాని కేట్టి ప్రత్యేక సాంఘిక ప్రయోజనాన్ని కలిగించడము లేదు అందరూ, వారివారి వయస్సునుబట్టి స్త్రీ పురుష భేదాలను బట్టీ, ఉపయోగించుకొనే దానికి ఎక్కువగానో తక్కువగానో వ్యయకరములయ్యే పనిముట్లే.

కూలీ చేతిలోనికి అతని జీతం ధనరూపంగా రాగానే, అతడు తాత్కాలికంగా యంత్రాధికారి దోపిడినుండి బయట పడినసూ, బూర్జువావర్గంయొక్క తదితర తెగలవారైన అద్దె గృహయజమాని, దుకాణదారుడు, తాకట్టుఋణదాత మొదలగునారు అతని చుట్టూ మూగుతారు. మధ్యతరగతియొక్క క్రింపమెట్టుయందుండే, చిన్నవర్తకులూ, దుకాణదారులూ, వర్తకాననుండి విరమించుకొన్నవారిలో సాధారణంగా అందరూ, చేతిపనులు చేసుకొనేవారు, రైతులూ, వీరంతా క్రమేణ శ్రామికులగుతారు. ఎందుకంటే కొంతవరకు, వారి పెట్టుబడి ఆధునిక పరిశ్రమాలను కొనసాగించేదానికిచాలదు. పెద్దపెట్టుబడి దారులతోటి పోటిలో అది అణగత్రొక్క వేయబడుతుంది. మరియు ఉత్పత్తియొక్క నవీన పద్ధతులచే వారియొక్క ప్రత్యేక నిపుణత ఎందుకూ పనికిమాలిందిగా చేయబడివుంది. ఈవిధంగా శ్రామికవర్గం అన్ని తరగతులనుండీ తయారగుతూవుంది.



శ్రామికవర్గం అభివృద్ధియొక్క వివిధదశలను దాటుతూ పోతుంది. దాని పుట్టుకతోనే బూర్జువావర్గముతోటి దాని కలహామారంభమగుతూవుంది. మొట్టమొదట ఈ కలహం కొలదిమంది కార్మికులచే వ్యక్తిగతంగా కొనసాగింపబడుతూవుంది. ఒకేయంత్రాగారానికి చెందిన కూలీలచేతను పిదప ఒకప్రదేశమున ఒకే పరిశ్రమకు చెందిన కూలీలచేతనూ, తమ్ము ప్రత్యక్షంగా దోచుకొనే బూర్జువావ్యక్తులకు వ్యతిరేకంగా, కొనసాగింపబడుతూవుంది. వారు బూర్జువా ఉత్పత్తి పరిస్థితులమీద తిరుగబడక ఉత్పత్తిపరికరణాలమీదనే దాడివెడల్తారు తమకు కూలీలేకుండ పోటీచేసే దిగుమతి వస్తువులను నాశనం కావిస్తారు. యంత్రాలను ముక్కలు ముక్కలుగా చేస్తారు. యంత్రాగారాలను తగులపెట్టుతారు. మధ్యయుగమందుండి మాయమైపోయిన కార్మికుని హోదాను, బలాన్ని ఉపయోగించి, పునరుద్ధరించేదానికి ప్రయత్నిస్తారు.

ఈ దశలో, కూలీలింకను దేశమంతా చెల్లాచెదరుగా ఉండి, ఏకీభవించక పరస్పర పోటీచే వేరుచేయబడ్డ ఒకసాఘుం ఇంతకన్నా చక్కని పొందికగల సంఘాలను నిర్మించేదానికి, ఎక్కడైనా ఏకీభవించిఉంటే, ఇదివారి స్వయంకృషి ఫలితముగు ఐక్యతగాక బూర్జువాయొక్క కృషిఫలితమే. బూర్జువావర్గం తనస్వీయ రాజకీయాదర్శాలను పొందేదానికి, శ్రామిక వర్గమునంతా కార్యక్షేత్రాన నడిచేటట్లు చేయకతప్పిందికాదు.

అంతేకాక ఇంకను కొంతకాలంవరకల్లే చేయగలదుకూడ ఈ దశలో, అందుచేత శ్రామికులు తమశత్రువులతో కయ్యానికి కాలుదువ్వరు. కాని తమశత్రువులకు శత్రువులైన నిరంకుశ రాజరికంయొక్క మిగిలిన బలగంతో, భూస్వాములతో; పారిశ్రామిక బూర్జువాకుచెందని మిగత బూర్జువాతో, ఛోటాబూర్జువాతో యుద్ధం చేస్తారు. ఈవిధంగా చారిత్రిక గతి యంతా బూర్జువాచేతిలోనే కేంద్రీకరింపబడి వుంది. ఈ విధంగా పొందబడిన ప్రతిజయం బూర్జువావర్గం యొక్క విజయమే.

కాని, పరిశ్రమ అభివృద్ధి అయ్యేకొలది, శ్రామికవర్గం లెక్కకు మిక్కుటమగుతుంది. పెద్దపెద్దసమూహాలగా కూడుకుంటుంది. దానిబలం ఎక్కువగుతుంది. తన ఆ బలాన్ని అది మునుపటికన్న ఎక్కువగా తెలసికొనగల్గుతుంది శ్రామికవర్గమందలి ఉద్దేశాలు, జీవితంయొక్క పరిస్థితులు రానురాను యంత్రాలు శ్రమభేదాలను రూపుమాపేకొలది సమానమగుతూఉన్నాయి. జీతాలను దాదాపు అన్నిస్థలాలందు ఒకే తగ్గుస్థితికి తెస్తూవున్నాయి. బూర్జువావర్గమందు వృద్ధిపొందే పోటీ, తన్మూలంగా ఏర్పడే వాణిజ్య క్షోభలవలన కార్మికుల వేతనాలు మరింత అస్థిరమగుతూఉన్నాయి. యంత్రాలయొక్క ఎడతెగని అభివృద్ధి మరింత శీఘ్రముగావృద్ధిపొందడంచేత, వారి జీవనోపాధులు రానురాను నాశనమయ్యేస్థితిలో:



వచ్చాయి. ప్రత్యేక కార్మికులకు ప్రత్యేక బూర్జువా వ్యక్తులకు మధ్యకలిగే సంఘర్షణాలు రానురాను ఈరెండు తరగతులయొక్క పోరాటాలుగా మారుతూ ఉన్నాయి. అందువల్ల బూర్జువావర్గానికి వ్యతిరేకంగా సంఘాలను (కూలీల సంఘాలను) ఏర్పాటుచేసేదానికి ఆరంభిస్తూ ఉన్నారు. వేతన ప్రమాణాన్ని తగ్గకుండా చేసేదానికి వారు ఒకటిగా చేరుతూవున్నారు. అప్పుడప్పుడు జరిగే ఈ తిరుగుబాటులకు ముందుగనే తగినయేర్పాటులు చేసేదానికి వారు శాశ్వతసంఘాలను స్థాపించుకుంటూ వున్నారు. అచ్చటచ్చట ఈస్పర్ధ రక్తపాతంతో గూడిన దొమ్మిగాకూడ మారుతూవుంది.

అప్పుడప్పుడు కార్మికులు విజయులగుతారు. కాని తాత్కాలింగానే- వారి యుద్ధాలయొక్క నిజమగు ఫలితం, వెంటనే కలిగే లాభాలలోకాక, ఎల్లప్పుడు విస్తరించే కార్మిక ఐక్యతయందు, కనబడుతుంది. పరిశ్రమచే నిర్మింపబడిన అభివృద్ధికరాలగు ఆధునిక రాకపోకలు ఈఐక్యతను మరింత ఎక్కువజేస్తూ ఉన్నాయి. ఈ రాకపోకలే వివిధ ప్రాంతాలనుండే కార్మికులు ఒకరితో ఒకరు కలసికొనేటట్లు చేస్తూవున్నాయి. సమాన స్వభావంగల అనేక స్థానిక పోరాటాలను, రెండువర్గాలమధ్య జరిగే దేశవ్యాపక కలహంగా కేంద్రీకరించే దానికి కావలసినదీకలయికయేల అయితే, ప్రతివర్గకలహం ఒకరాజకీయ పోరాటమే, ఇట్టి ఐక్యతను పొందేదానికి, మధ్యయుగ

మందలి పురనివాసులకు, వారి దరిద్రపు రస్తాలు మూలంగా కొన్ని శతాబ్దాలు కావలసి వచ్చాయి. ఆఐక్యతనే రైలు మార్గాల దయవలన కొద్ది సంవత్సరాలలో ఆధునిక శ్రామికులు పొందకలిగారు.

శ్రామికులను ఈవిధంగా ఒకతరగతిగా, తద్వారా ఒకరాజకీయ పక్షంగా చేసే సంఘటనను, కార్మికుల మధ్యనే గలపోటీ సదాతలక్రిందుల చేసేస్తూ ఉంది. కాని అది ఎల్లప్పుడు తిరిగి మరింత బలిష్టముగా మరింతదృఢంగా మరింత శక్తివంతముగా చేస్తూఉంది. బూర్జువా వర్గమందలి అంతర్విభేదాల వలన లాభంపొంది అది కార్మికుల యొక్క ప్రత్యేక లాభాలను చట్టం అంగీకరించేటట్లు చేస్తూవుంది. ఇట్లే 10 గంటల (21) బిల్లు ఇంగ్లండులో చట్టం చేయబడింది.

మొత్తానికి, పాతసమాజంలోని వర్గాలమధ్య జరిగే సంఘర్షణలు అనేకవిధాల కార్మికుల అభివృద్ధిని పెంపొందిస్తూయున్నాయి. బూర్జువావర్గం తానుఎడతెగని యుద్ధమందు చిక్కుకొని ఉండడం తెలిసికుంటూవున్నది. మొట్టమొదట కులీన ప్రభుత్వంతో అటుపిమ్మట పారిశ్రామికాభివృద్ధికి ఆటంకకరములయ్యేలాభాలుగల బూర్జువావర్గమునందలి కొన్ని శాఖలతో, విదేశాలందుండే బూర్జువావర్గాలతో అన్ని సమయాలందూ, ఈపోరాటాన్ని కొనసాగించాలసివుంది. ఈ



యుద్ధాలన్నిటిలోను శ్రామికవర్గాన్ని సాయమపేక్షిస్తూ ప్రార్థించక తప్పదనిన్నీ, అందుమూలంగా కార్మికవర్గాన్ని రాజకీయరంగానికి ఈడుస్తూవున్నాననీ కూడ తెలిసికుంటూ వుంది. అందుచేత బూర్జువావర్గమే, తనయొక్క రాజకీయ విద్యను, సామాన్యవిద్యను శ్రామికవర్గానికి బోధిస్తూవుంది. అనగా బూర్జువావర్గంతో యుద్ధము చేసేదానికి కావలసిన ఆయుధాలను బూర్జువావర్గమే శ్రామికులకు ఇస్తూవుంది.

మరియు, శాసకవర్గంలోని అనేక సంపూర్ణ తెగలు, పారిశ్రామికాభివృద్ధివలన శ్రామికులస్థితికి ఆకస్మికంగా తేబడుతూఉన్నాయనీ, కనీసం వారి జీవనోపాధులకు భంగం కలిగే పరిస్థితులేర్పడుతూ ఉన్నాయనీ, మనమీవరకే చూచివున్నాము. ఈ తెగలుకూడ శ్రామికవర్గానికి, విజ్ఞాన కరాలయ్యేటట్టే, అభివృద్ధికరాలయ్యేటట్టే, అంశాలను ఇస్తూవున్నాయి.

ఆఖరది:వర్గ కలహం నిశ్చితసమయాన్ని సమీపించేకాలంలో, శాసకవర్గంలో, కేవలం శాసకవర్గంలోనేకాదు, పురాతన సమాజమందంతటా, వృద్ధిచెందుతూ ఉండినశిథిలత అతితీవ్రరూపంతో, ప్రత్యక్షమగుతుంది. అదిచూచి, శాసకవర్గమందలి ఒకచిన్నభాగం మాత్రం దానినుండివేరై, భవిష్యత్తంతా తనచేతులలోకల విప్లవవర్గాన్ని చేరుతూఉంది. అంత

నుపూర్వమొకప్పుడు ప్రభువులలో కొంతమంది బూర్జువావర్గ పక్షమేవిధంగా అవలంబించారో ఆవిధంగానే ప్రస్తుతంకూడ బూర్జువావర్గంలో కొంతభాగం శ్రామికవర్గంలోకి వెళ్లిచేరుతుంది. ముఖ్యంగా ఈచారిత్రక గతినంతా పూర్తిగ సిద్ధాంత రీత్యా గ్రహించగలిగే బూర్జువాఆదర్శవాదులు ఇట్టివారు.

నేడు, బూర్జువావర్గానికి ముఖాముఖిగా ఎదురొడ్డి నిలబడిఉండే వర్గాలన్నిటిలోనూ, శ్రామికవర్గమే, నిజంగా విప్లవకారియైనవర్గం. మిగిలినతరగతులన్నీ ఆధునిక పారిశ్రామికాభివృద్ధివలన క్షీణించి అదృశ్యమై పోతాయి.

మధ్యతరగతియందలి కడమెట్టువారు, చిన్నపరిశ్రమాధికారి, దుకాణదారుడు, చేతిపనివాడు, రైతు, వీరంతా మధ్యతరగతియొక్క అంశాలుగా ఉండే తమ ఆస్తిత్వాన్ని నాశనంగాకుండా రక్షించుకొనేటానికి బూర్జువావర్గానికి వ్యతిరేకంగా దెబ్బలాడుతారు. అందుచే వారువిప్లవకారకులు కారు. వారు యథాస్థితివాదులు. అంతేకాదు. వారు కాలచక్రాన్నే, చారిత్రికగతినే, వెనక్కిత్రిప్పే దానికి ప్రయత్నించే పురాతనవాదులు. ఒకవేళ వారు విప్లవకారులైన అది తాము శ్రామికవర్గంలోనికి మార్చబడ నుండుట చేతనే అట్లు అవుతూ ఉన్నారు. వారీవిధంగా తమవర్తమాన లాభాలనుగాక భవిష్యల్లాభాలను రక్షించుకుంటారు. వారీవిధంగా తమ దృక్పథాన్ని వదలి శ్రామిక దృక్పథాన్ని అవలంబిస్తారు.



పురాతన సమాజపు అత్యంత తక్కువ భాగములకు చెంది అణగదొక్కబడుటచే పూర్తిగా అవినీతి పరులై సామాజికాభివృద్ధికి అపాయకరమైన వర్గంగా మారినవారి నుండి, కొద్దిమందిని శ్రామికవిప్లవము తనవైపునకు లాగుకొనును. కాని దాని జీవితపరిస్థితుల మూలంగా ముఖ్యంగాఅది పురాతన వాదుల కుట్రకు, లంచగొండి పనిముట్టు అయ్యేదానికి ఎక్కువ అవకాశాలున్నాయి.

శ్రామికవర్గానికి పురాతన సమాజపు సాంఘికపరిస్థితులులేవు. శ్రామికునికి ఆస్తిలేదు. భార్యాబిడ్డల తోటి అతని సంబంధానికీ, బూర్జువాకుటుంబసంబంధాలకీఎట్టి సామ్యమూ లేదు. ఆధునిక పరిశ్రమలందలి పని, ఫ్రాన్సులో వలె ఇంగ్లండునందూ, జర్మనీలోవలె అమెరికా యందునూ ఉన్న ఆధునిక పెట్టుబడికి దాస్యం, అతనికి జాతీయత కొంచెంకూడ లేకుండా జేసివేసాయి. న్యాయము, నీతి, మతం, అతనికి కేవలం బూర్జువాయొక్క పక్షపాతపు నియమాలే. ఈ నియమాలెన్నివున్నాయో అన్నింటను బూర్జువాస్వప్రయోజనాలు మరుగుపడి వున్నాయి.

అంతకుముందు, పైచేయి కలిగివుండినవర్గాలన్నీ, తమవినియోగపరిస్థితులను సమాజమంతా లొంగేటట్లుచేసి తామదివరకే సంపాదించుకొని వుండిన అధికారహోదాను

రక్షించుకొనేదానికి ప్రయత్నించాయి. శ్రామికులు, తమస్వీయ వినియోగవిధానాన్ని నాశనంచేయందే సమాజంయొక్క ఉత్పత్తిసాధనాలకు స్వాములు కాజాలరు. అట్లుచేసేటప్పుడు అంతకుముందటి తదితర వినియోగ విధానాలనుకూడ నాశనంచేయకతప్పదు. వారు పొందవలసిందేమీ లేదు. వారు రక్షించుకోవలసిందికూడ ఏమీలేదు. వ్యక్తిగత ఆస్తియొక్క పూర్వపు జామీనులను, భీమాలను నాశనంచేయడమే వారిపని.

వెనుకటి చారిత్రికోద్యమాలన్నీ అల్పసంఖ్యాకుల వుద్యమాలు. లేదా వారిలాభాలకోసం వుద్దేశింపబడ్డ వుద్యమాలు. కార్మికోద్యమం తనశక్తితో నెరిగిన స్వతంత్ర అత్యధిక సంఖ్యాకుల వుద్యమం. అది అత్యధికసంఖ్యాకుల లాభంకోసం వుద్దేశింప బడ్డది. మనప్రస్తుత సమాజంయొక్క కడమెట్టడు యందలి శ్రామికవర్గం, దానిపైనుండే అధికారసమాజపు పొరలనన్నిటినీ పైకిగాలిలోకిచిమ్మివేయకుండా కదలజాలదు; లేవజాలదు. నిజానికి బూర్జువాతోటి కార్మికకలహం జాతీయ కలహం కాకపోయినా, చూచేదాని మాత్రం మొదట జాతీయకలహంగా వుంటుంది. నిస్సంశయంగా ప్రతిదేశపు కార్మికవర్గం మొట్టమొదట తనదేశపు బూర్జువావర్గపు పని పట్టవలసివుంది.



అభివృద్ధియొక్క అతిసాధారణదశలను వర్ణించేటప్పుడే ప్రస్తుతసమాజమందు, ఎక్కువగానో, తక్కువగానో చాటు చాటున ప్రజ్వరిల్లుచుండే అంతఃకలహాన్ని, ఆకలహం బహిరంగ విప్లవంగా పరిణమించేవరకు, బూర్జువావర్గాన్ని బలవంతంగా కూలదోసి శ్రామికవర్గంయొక్క పరిపాలనానికి పునాదివేసేవరకు సూచించియున్నాము.

ఇంతకుముందు ప్రతిసమాజస్వరూపం పీడించువర్గము పీడింపబడే వర్గాల స్పర్థమీదనే ఆధారపడి వుండిందని మనముచూచి వుంటిమి. కాని ఒక వర్గాన్ని పీడించాలన్న ఆవర్గానికి కనీసం దాని బానిసతుల్య అస్తిత్వాన్ని కొనసాగించుటకు కావలసిన పరిస్థితులను కలుగజేయక తప్పదు. దాసుడు, దాసత్వయుగంలో స్వతంత్ర పట్టణాలలో సభ్యత్వాన్ని సంపాదించుకోకలిగాడు. అట్లే ఛోటాబూర్జువా జమీందారీ నిరంకుశాధికారంక్రింద ఏదోఒకవిధంగా బూర్జువాకాగలిగింది. కాని నేటి కూలీ, పారిశ్రామికాభివృద్ధితో పాటు, తాను కూడ వృద్ధిచెందేదానికి బదులు, తనవర్గం యొక్క అస్తిత్వపరిస్థితులకన్న హీనస్థితికి వచ్చివున్నాడు. అతడు కటిక దరిద్రుడగుతూవున్నాడు. కటికదారిద్ర్యం, జనసంఖ్యకన్న, సంపదకన్న, త్వరితంగా వృద్ధిపొందుతూవుంది.

అందుచేత, బూర్జువావర్గం ఇక ఏమాత్రం సమాజంమీద శాసకవర్గంగా వుండేదానికీ, తన సామాజిక విధానాన్నే, సమాజానికంతా తగిన గొప్పన్యాయమని విధించేదానికీ, తగదని ఇప్పుడు స్పష్టమగుతూవుంది. తన బానిసత్వంలో దాను జీవించేదానికి కావలసిన పరిస్థితులనుకూడ తన బానిసకు బూర్జువావర్గం కలుగజేయలేక పోవడంచేతనూ, బానిసచే పోషింపబడేదానికి బదులు, అతన్నే పోషించాలసినట్టి స్థితిలోకి అతనిని పోనిచ్చుటచేతనూ, బూర్జువావర్గం పాలించేదానికి తగదు. సమాజం ఇంక ఎంతమాత్రం ఈ బూర్జువావర్గవిధానంలో నివసించలేదు. అంటే బూర్జువావర్గంయొక్క అస్థిత్వం సమాజానికి అనుకూలంకాదు.

బూర్జువావర్గంయొక్క అస్తిత్వానికీ, దాని పరిపాలనానికీ, ప్రధానషరత్తు, పెట్టుబడియొక్క నిర్మాణం, పెట్టుబడియొక్క వృద్ధి. పెట్టుబడి కూడేదానికి కావలసినది వేతనకృషి. వేతనకృషి పూర్తిగా కార్మికుల మధ్యవుండేపోటీమీద ఆధారపడివుంది. పారిశ్రామికాభివృద్ధి, (దీన్ని బూర్జువావర్గం తాను తెలసికొనకయే, వృద్ధిపొందిస్తువుంది) పోటీవల్లకలిగిన కూలీల ఎడబాటునుపోగొట్టి, కలయిక మూలంగా విప్లవ సంయోగాన్ని కలిగిస్తువుంది. అందుచేత, ఆధునిక పారిశ్రామికాభివృద్ధి బూర్జువావర్గపు వుత్పత్తి వినియోగ విధానాల పునాదులనే



త్రివ్వివేస్తువుంది. అందుచేత బూర్జువావర్గం అన్నిటికన్న ముఖ్యంగా తయారుచేసేది తన వినాశకారులనే. దానిపతనం, శ్రామికవిజయం రెండునూ తప్పనిసరిగా రానున్నాయి!!



# అధ్యాయం రెండు.

## శ్రామికులు. కమ్యూనిస్టులు.

శ్రామికవర్గంతో, కమ్యూనిస్టుల కెట్టి సంబంధముంది?

కమ్యూనిస్టులు మిగిలిన కార్మికపక్షాలకు వ్యతిరేకమగు (22) ఒక ప్రత్యేక పక్షానికి చెందినవారు కారు.

వారికి, శ్రామికవర్గ మొత్తటియొక్క క్షేమముగాక మరెట్టి ప్రత్యేకోద్దేశాలును లేవు.

శ్రామికుల ఉద్యమానికి స్వరూపమిచ్చి నడిపేదానికి వారు, శ్రామికులలో తెగలేర్పడేటట్టి సిద్ధాంతాలవేనిని సొంతంగా పెట్టరు.

కమ్యూనిస్టులు, మిగిలిన కార్మికపక్షాలనుండి ఈక్రింది విషయాల వలననే గుర్తింపబడుతూవున్నారు. 1. వివిధ దేశాలలో కార్మికుల జాతీయపోరాటాలలో, వారు, ఎట్టి జాతీయతకు సంబంధించని సర్వశ్రామిక సామాన్యమగు శ్రామికలాభాలను చూపుతూ, అవి ప్రథమ స్థానాన్ని ఆక్రమించేటట్లు చేస్తూవున్నారు. 2. బూర్జువావర్గంతోటి కార్మికవర్గకలహం దాటవలసివుండే వివిధదశలందును, వారు



ఎల్లప్పుడూ, ఎల్లెడలా, వుద్యమంయొక్క మొత్తపులాభాన్ని అనుసరించియే కార్యాన్ని నడుపుతారు.

అందుచే కమ్యూనిస్టులు ఒకవైపు ప్రతిదేశమందునూ, ఆచరణలో, అచ్చటి కార్మికపక్షాలన్నిటిలోనుచాల ముందంజ వేసే దృఢసంకల్పంగల తెగకు చెందుతారు. ఆతెగయే మిగిలిన వానినన్నింటిని ముందుకు నెట్టుతుంది. మరియొకవైపు సిద్ధాంతరీత్యా, శ్రామికవర్గములో ఎక్కువభాగం గ్రహించి వుండనట్టి వుద్యమం నడువవలసిన మార్గాన్ని, పరిస్థితులును, దానిఅంత్య సాధారణఫలితాలును, స్పష్టంగాగ్రహించి నందువల్ల కలిగేటట్టి అధిక కార్యానుకూలతను వీరుకలిగియున్నారు.

మిగిలిన శ్రామికపక్షాల వుద్దేశం వలెనే, వెంటనేజేయవలసిన పనినిగూర్చి కమ్యూనిస్టుల వుద్దేశంకూడ, శ్రామికుల నందరిని ఒకేవర్గానికి చెందేటట్లు జేయడం; బూర్జువా ఆధిపత్యాన్ని పడగొట్టడం. శ్రామికులు రాజకీయాధికారాన్ని గెల్చేటట్లు జేయడం అనేదే.

విశ్వసంస్కర్తకాబోవు ఎవరో ఒకవ్యక్తిచే కనుగొనబడినట్టీ, కల్పించబడినట్టి భావాలమీదగాని, సూత్రాల మీదగాని, ఏమాత్రం కమ్యూనిస్టుల సిద్ధాంతనిర్ణయాలు ఆధారపడి వుండడంలేదు.

ప్రస్తుతం, వుండేవర్గకలహంనుండి, మనకండ్ల యెదుటనే జరుగుతూవున్న ఒక చారిత్రికోద్యమాననుండి, బయలువెడలిన ప్రస్తుత సంబంధాలనే, కమ్యూనిష్టు సిద్ధాంతాలు, సాధారణ పదాలలో వెల్లడిస్తూవున్నాయి. ప్రస్తుతపు ఆస్థిసంబంధాలను రద్దుపరచడం కమ్యూనిజం యొక్క ప్రత్యేక లక్షణం ఏమాత్రమునూకాదు.

చారిత్రిక పరిస్థితుల యందలి మార్పుల ననుసరించి గతమున, ఆస్తిసంబంధాలన్నీ చారిత్రిక మార్పునకు ఎడతెగక లోనగుతూనే వచ్చివున్నాయి.

వుదాహరణంగా చూడండి. ఫ్రెంచి విప్లవం జమీందారీ ఆస్తిని, బూర్జువా ఆస్తికోసం, నాశనమొనర్చి వుంది.

కమ్యూనిజం యొక్క విలక్షణ స్వభావం సామాన్య ఆస్తిని లేకుండ జేయడంకాదు. బూర్జువా ఆస్తిని లేకుండ జేయుటయే. అయితే ఆధునిక వ్యక్తిగత బూర్జువాఆస్తి, వర్గస్పర్థల మీదనూ; అనేకులను కొద్దిమంది దోచుకొనే విధానముమీదను, ఆధారపడినట్టి వుత్పత్తి వినియోగ విధానాల యొక్క సంపూర్ణమగు ఆఖరిరూపే.

ఈఅర్థాననే కమ్యూనిష్టుల సిద్ధాంతాలను ఒకే వాక్యంలో క్రోడీకరింపవచ్చు:— వ్యక్తిగత ఆస్తి లేకుండ జేయడం.



మనుష్యుడు తనస్వయంకృషి ఫలితమయినఆస్తిని తాను పొందేదానికుండే హక్కును రద్దుపరచ గోరుతున్నామని కమ్యూనిస్టులమగు మమ్ము నిందిస్తారు. ఆ ఆస్తియే వ్యక్తిస్వాతంత్ర్యానికి, పరిశ్రమకూ, స్వతంత్రానికంతకూ, పునాదిఅని కూడ చెప్పబడుతూఉంది.

కష్టార్జితం, స్వీయార్జితం, స్వయంసంపాదితం అగు ఆస్తియా! బూర్జువారూపం గైకొనేదానికిముందు ఉండేచిన్నచేతి పనివానియొక్క, చిన్నరైతు యొక్కఆస్తియనియా మీభావం? దానిని నాశనం గావించాలసిన అవసరంలేదు. ఎందుకంటే, పారిశ్రామికాభివృద్ధి దానిని చాలవరకిదివరకే నాశనం గావించింది. మిగిలినదాన్ని ప్రతిదినమింకనూ, నాశనం చేస్తూఉంది.

లేక ఆధునిక వ్యక్తిగత బూర్జువా ఆస్థి అనియా మీ అభిప్రాయం?

అయితే వేతనకృషి, కార్మికునికి ఏమైన ఆస్తిని సృజిస్తుందా? రవ్వంతకూడలేదు. అది పెట్టుబడిని (అనగా వేతన) కృషిఫలితాన్ని (దోచుకొనే ఆస్థిని) సృజిస్తువుంది. ఆ పెట్టుబడి నూతన దోపిడికోసం, నూతన వేతన కృషి [illegible] వృద్ధిపొందలేదు. ఆస్తిప్రస్తుత రూపం, (పెట్టుబడి) [illegible] వేతనకృషియొక్క పరస్పర స్పర్ధమీద ఆధారపడిఉంది. ఈ స్పర్ధయొక్క ఇరుపక్షాలను మనము పరిశీలిస్తాము.



పెట్టుబడి దారుడుగ వుండడం వుత్పత్తి విధానంలో కేవలం వ్యక్తిగత హోదానే కాక సాంఘిక హోదాను కూడ కలిగివుండడమే. పెట్టుబడి ఒకసమిష్టి పదార్థం.అందుచేత అనేకసభ్యులయొక్క ఐక్యకృషి చేతనే, అంతేకాదు, చివరకు, సమాజమందుండే అందరియొక్క ఐక్యకృషి చేతనే,అదపనిచేసేటట్లు చేయబడుతుంది.

అందుచేత పెట్టుబడి వ్యక్తిగతశక్తికాదు. అది సామాజికశక్తి.

అందుచేత, పెట్టుబడి వుమ్మడిసొత్తుగా మార్చబడినపుడు, సమాజమునందుండే సభ్యులందరిసొత్తుగా మార్చబడినపుడు, అంతమాత్రానే వ్యక్తిగత ఆస్తి సామాజిక ఆస్తిగా మారడంలేదు. ఆస్తియొక్క సామాజిక లక్షణం మాత్రమే మార్చబడింది.అది కేవలం తనవర్గ లక్షణాన్ని పోగొట్టుకుంటుంది.

ఇక వేతనకృషిని తీసికుంటాము. కూలీ, కూలీగా బ్రతికేదానికి తప్పనిసరిగా కావలసిన జీవనోపాధులయొక్క అవిభజనీయ కణికయే, కనీసపుకూలియే, వేతనకృషి యొక్క సరాసరివెల. అందుచేత, వేతనం తీసికొనేకూలీ, తనపనిమూలాగా తాననుభవించేది, ఏపూటకాపూట తెచ్చుకొని జీవితాన్ని గడిపేదానికీ, అట్టి జీవితాలేగల బిడ్డలను పుట్టించే



దానికి, చాలింది మాత్రమే. పనిమూలంగా వచ్చేపదార్థాల యొక్క ఇట్టి వ్యక్తిగత వినియోగాన్ని, జీవనం గడిపే దానికి, మానవజీవిని పుట్టించేదానికి చేయబడే ఈవినియోగాన్ని, ఇతరులపనిని తనకోసం ఉపయోగించుకొనే వీలుకలిగే టట్లు చేసేదానికి కావలసిన అధికతను మిగల్చని ఈవినియోగాన్ని, మేమెంతమాత్రం లేకుండ జేయదలచు కోలేదు. దేనిక్రింద కార్మికుడు పెట్టుబడిని వృద్ధిచేసేదానికి మాత్రం నివసిస్తూ ఉన్నాడో, శాసకవర్గంయొక్క లాభానికిఅవసరమైనంత వరకు మాత్రమే జీవింపబడనిస్తూఉన్నాడో, అట్టి ఈ వినియోగం యొక్క ఈ శోచనీయస్వభావాన్ని నాశనం చెయ్యాలనియే మేముకోరేదంతా.

బూర్జువా సమాజంలో, ప్రాణంతో ఉండే కూలీలు గూడుకొన్న కృషిని (పెట్టుబడిని) మరింత వృద్ధిచేసే దానికి మార్గాలే. కమ్యూనిస్టు సమాజంలో గూడుకొన్న కృషి, కూలీయొక్క జీవితాన్ని పెంపొందించే దానికీ, విశాల మొనర్చేదానికి, భాగ్యవంతంచేసే దానికి, మార్గం.

అందుచే, బూర్జువా సమాజంలో గతం వర్తమానం పై అధికారం చెలాయిస్తూవుంది. కమ్యూనిస్టు సమాజంలో వర్తమానం గతంపై అధికారం చెలాయిస్తూ ఉంటుంది. బూర్జువాసమాజంలో పెట్టుబడి స్వతంత్రం, వ్యక్తిత్వం కలది. కాని జీవించే వ్యక్తి పరాధీనుడు. వ్యక్తిత్వం లేనివాడు.

ఇట్టి స్థితిగతులను నాశనంచేయడం వ్యక్తిత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని నాశనం గావించడమని, బూర్జువావర్గం పేరిడుతుంది! అది నిజమేకూడ. ఎందుకంటే, బూర్జువావ్యక్తిత్వాన్ని, బూర్జువా స్వాతంత్ర్యాన్ని, బూర్జువా స్వేచ్ఛను, నాశనం చేసేదానికి నిస్సందేహంగా ప్రయత్నిస్తూఉన్నాము.

ప్రస్తుత బూర్జువావుత్పత్తి పరిస్థితులలో, స్వేచ్ఛ యనగా అర్థం స్వేచ్ఛావాణిజ్యం స్వేచ్ఛా క్రయవిక్రయాలు, అని.

కాని క్రయవిక్రయాలు మాయమైతే, స్వేచ్ఛాక్రయ విక్రయాలు కూడ అదృశ్యమగుతాయి. మనబూర్జువావర్గం యొక్క 'అన్నింటాస్వేచ్ఛ' అనేదాన్ని గురించిన పెద్దకబుర్లకు స్వేచ్ఛాక్రయవిక్రయాల గురించిన ఈ సంభాషణకూ, ఏమైన అర్థముంటే, అదిమధ్యయుగమందుండిన సంకుచిత క్రయవిక్రయాలతో, అనేక బంధనాలుగల వర్తకులతో పోల్చి చూచినప్పుడే. కాని, కమ్యూనిస్టుల క్రయవిక్రయాలు లేకుండా చేయడంతో, ఈ ఉత్పత్తిపరిస్థితులు లేకుండా చేయడంతో, బూర్జువావర్గాన్నే లేకుండా చేయడంతో పోలిస్తే దానికి ఎట్టి అర్థమూ ఉండదు.

వ్యక్తిగత ఆస్తిలేకుండా చెయ్యాలనే మా కోరికను వినగానే మీరు భయభ్రాంతులగుతూ ఉన్నారు. కాని మీ



యీప్రస్తుత సమాజంలో పదింటతొమ్మిది వంతుల జనానికి వ్యక్తిగత ఆస్తిలేకుండా ఇదివరకే చేయబడింది. కొలదిమంది దగ్గరనైనా అదివుండేదానికి కారణం ఆతొమ్మిదివంతుల జనం వద్దలేకుండా ఉండడమే. అందుచే దేనిఆస్తిత్వం సమాజమందు అత్యధిక సంఖ్యాకుల కెట్టి ఆస్తి లేకుండా ఉండడంమీదనే ఆధారపడి ఉందో అట్టి ఆస్తిస్వరూపాన్ని మేము లేకుండ జేయగోరుతున్నామని మీరు మమ్ము నిందిస్తూవున్నారు.

ముక్తసరిగా, మీఆస్తిలేకుండ చేయగోరుతూఉన్నామని మీరుమమ్మునిందిస్తూఉన్నారు. ఖండితంగా మేముచేయగోరేది అదే.

ఏక్షణాననుండి, కృషి, పెట్టుబడిగా, డబ్బుగా, కిరాయిగా, కొలదిమంది చేతులలోకి తీసుకరాబడకలిగే సాంఘిక శక్తిగా, మార్చబడజాలదో, అనగా, ఏక్షణాననుండి వ్యక్తిగత ఆస్తి బూర్జువాఆస్తిగా, పెట్టుబడిగా, ఇకమార్చబడలేదో-అక్షణాననుండే వ్యక్తిత్వం మాటుమణుగునని మీరంటారు.

అందుచే వ్యక్తిఅనగా మీయభిప్రాయాన బూర్జువా కాక వేరొండు మనిషికాదు; ఆస్తియొక్క మధ్యతరగతి సొంతదారుడు కాక వేరొకడుకాడు. ఇదిమీయభిప్రాయమని మీరంగీకరించకతప్పదు. ఈవ్యక్తిని అభివృద్ధికి ప్రతిబంధనము కాకుండా నాశనంచేయక తప్పదు. ఇట్టిమనిషి ఉండడం అసంభవం కావించాలి.

సమాజంయొక్క వస్తువులను వినియోగించేదానికి, ఏ మనుష్యుని హక్కునూ కమ్యూనిజం లాగుకోదు. అది చేసేదంతా, అట్టి వినియోగంవలన ఇతరులు కష్టాన్ని లోబరచుకొనే శక్తిని మాత్రం ఊడబెరకుటయే.

వ్యక్తిగత ఆస్తిని లేకుండ జేయగనే పనులన్నీ ఆగిపోతాయని, ప్రపంచమును సోమరితనం ఆవరిస్తుందనీ, అభ్యంతరాలు చెప్పబడ్డాయి.

దీనిప్రకారం, బూర్జువాసమాజ మిదివరకెప్పుడో శుద్ధ సోమరితనంవల్ల నాశనమైపోయి వుండాలసిందే. ఎందుకంటే పనిచేస్తూఉండేదాని సభ్యులుఏమీ ఆర్జించడంలేదు. ఏమైనా ఆర్జించేవారు పనిచేయకుండా వుండేవారే. ఈ అభ్యంతరమంతా ఈ క్రింది పునరుక్తితప్ప వేరేమీకాదు:— పెట్టుబడి ఇకమీద లేనపుడు వేతనకృషియు ఇకమీద ఉండదు.

భౌతిక పదార్థాలయొక్క, కమ్యూనిస్టు వుత్పత్తి వినియోగ విధానాలకు వ్యతిరేకంగా తేబడేటట్టి అభ్యంతరాలన్నీ కమ్యూనిస్టుల వైజ్ఞానిక పదార్థోత్పత్తి వినియోగ విధానలకు వ్యతిరేకంగాకూడ తేబడుతూ ఉన్నాయి. ఒక వర్గపు ఆస్థి అదృశ్యముకావడమే, బూర్జువావర్గానికి ఉత్పత్తి అంతా అదృశ్యము కావడంగా తోచినట్లే, ఒక వర్గవిజ్ఞానం నశించడం విజ్ఞానమంతా నశించడంతో సమానంగా దానికి తోస్తుంది.



ఏవిజ్ఞాన వినాశం కోసం బూర్జువావర్గం దుఃఖిస్తుందో, అదిఅత్యధిక సంఖ్యాకులకు యంత్రాలవలె పనిచేసేదానికియ్యబడే శిక్షణ మాత్రమే.

బూర్జువా ఆస్తిని లేకుండా చేయగోరే మావుద్దేశానికి, మీ బూర్జువాస్వేచ్ఛ, మీ బూర్జువా విజ్ఞానం, మీబూర్జువా న్యాయాల ప్రమాణాన్ని వర్తింపజేసి మాతో వాదించవద్దు. మీభావాలన్నీ, మీబూర్జువా వుత్పత్తి విధానంనుండీ బూర్జువా ఆస్తియొక్క ఆస్థితిగతులనుండీ పుట్టిపెరిగినవే. అట్లే అందరికి వర్తించేటట్లు చేయబడింది మీసంకల్పం. అదేమీధర్మశాస్త్రం మీసంకల్పనయొక్క ప్రధానస్వభావం ప్రధానగతి, మీతరగతి ఆస్తిత్వంయొక్క ఆర్థిక పరిస్థితులచేత నిర్ణయించబడివుంది.

మీయొక్క ప్రస్తుత వుత్పత్తి విధానమునుండీ, ఆస్తి రూపాలనుండి వుద్భవిల్లే సామాజిక రూపాలను, వుత్పత్తి వికాసమందు వుద్భవిల్లి అదృశ్యమయ్యే ఈ చారిత్రిక సంబంధాలను, ప్రకృతియొక్కయు, హేతుబుద్ధియొక్కయు, శాశ్వత నియమాలగా మార్చేదానికి స్వార్థపరత్వంతోకూడి వుండే ఈ మీభ్రమ మీకుముందుండిన ప్రతిశాసకవర్గానికీ వుండిందే. ప్రాచీన ఆస్థినిగురించి మీరు స్పష్టముగాక చూచేది జమీందారి ఆస్థినిగురించి మీ రంగీకరించేది, మీ స్వకీయబూర్జువా ఆస్థి విషయాన మీరుచూడలేకపోవుట సహజమే.

కుటుంబనాశనం ! కమ్యూనిస్టులయొక్క ఈ అపకీర్తి కరమయిన ఉపపాదనవల్ల అత్యధిక ఉదారవాదులుకూడ మండిపడుతారు.

ఏ పునాదిమీద ప్రస్తుతపు కుటుంబం, బూర్జువా కుటుంబం, ఆధారపడిఉంది ? పెట్టుబడిమీద; వ్యక్తిగతలాభం మీద. దాని పూర్తిరూపాన, ఈ కుటుంబం కేవలం బూర్జువా యందే ఉంది. ఈపరిస్థితులయొక్క సహజ పర్యవసానం శ్రామికులమధ్య, కుటుంబం బొత్తిగా లేకపోవడమందూ, బహిరంగ వ్యభిచారమందూ, కనపడుతూఉంది.

బూర్జువాకుటుంబంయొక్క సహజపర్యవసానం మాయమైపోతే అదికూడ మాయమైనట్లే. రెండూకూడ, పెట్టుబడి అదృశ్యంకావడంతో అదృశ్యమగుతాయి.

తల్లిదండ్రులు తమ పిల్లలను స్వార్థమునకుపయోగించుకోవడం మేము మాన్పగోరుతున్నామని మీరంటారా ? ఈ నేరాన్ని మేము అంగీకరిస్తాము.

కాని మేము గృహవిద్యకుబదులు సామాజికవిద్యను ఏర్పరచడంచేత, మేము సంబంధాలన్నిటిలో అధిక పవిత్రమైన వానిని నాశనం గావిస్తున్నామని మీరంటారు.

ఇక మీ విద్యావిధానం ! అదిమాత్రం సామాజికం కాదా? అదిమాత్రం మీరు విద్యచెప్పే సామాజిక పరిస్థితుల



వల్ల, సమాజం ప్రత్యక్షంగానో పరోక్షంగానో జోక్యం కలిగించుకోవడంవల్ల, పాఠశాలలు మొదలగువానివల్ల, నిర్ణయింపబడడంలేదా? విద్యావిషయాల్లో సమాజంయొక్క జోక్యాన్ని కమ్యూనిస్టులు కల్పించలేదు. కాని వారాజోక్య స్వభావాన్నిమాత్రం మార్చగోరుతూ వున్నారు. అట్లుచేసి శాసకవర్గంయొక్క పలుకుబడినుండి విద్యను రక్షించగోరుతూ ఉన్నారు.

కుటుంబాన్నిగూర్చి, విద్యనుగూర్చి, తలిదండ్రులకు బిడ్డకుగల పరస్పరపవిత్రసంబంధాలను గురించీ, ఈబూర్జువా కరతాళధ్వనులు, అధునిక పరిశ్రమయొక్క పనివల్ల, శ్రామికులమధ్య కుటుంబ బంధనాలన్నీ నాశనం చేయబడి వారి బిడ్డలు వాణిజ్యసరకులుగా, శ్రమపరికరణాలగామార్చబడడం హెచ్చేకొలంది మరింతఅసహ్యకరంగా కనబడుతూఉన్నాయి.

“అయితే, కమ్యూనిస్టులూ ! మీరు స్త్రీలందుకూడ సమాన అనుభవాధికారాన్ని ప్రవేశపెట్టా” రని బూర్జువా వర్గమంతా ఘోషపెడుతూఉంది.

బూర్జువా తన భార్యను కేవలం ఉత్పత్తిసాధనంగా చూస్తున్నాడు. ఉత్పత్తిసాధనాలన్నీ సమిష్టిగాఉపయోగించుకోవాలని అనడం అతడువింటూ ఉన్నాడు. అందుచేత, సహజంగా, అన్నిటికీ కలిగే సామాన్యస్థితే స్త్రీలకుకూడ కలుగుతుందనే నిర్ణయానికి కాక మరెట్టి నిర్ణయానికి వస్తాడు ?

ఉత్పత్తిసాధనాలుగా ఉండే స్త్రీలయొక్క ఈస్థితిని నాశనంచేయడమే ఇచ్చట నిజాంశమని అతడూహించికూడ ఉండలేదు.

మరియు, కమ్యూనిస్టులచే బహిరంగా, అధికారరీత్యా స్త్రీలయందు సమాన అనుభవాధికారాన్ని స్థాపింపబడపోయ్యేటట్లు నటించే మనబూర్జువాయొక్క ధార్మికకోపాని కన్న పరిహాసాస్పదమైంది మరేదీలేదు. స్త్రీలయందు సమానానుభవాధికారాన్ని కమ్యూనిస్టులు ప్రవేశపెట్టాలసిన అవసరంలేదు. అది దాదాపు అనాదినుండీ వస్తూనేఉంది.

మనబూర్జువా, సామాన్యవ్యభిచారులనేకాక, శ్రామికుల భార్యలను కూతుండ్రను తమ ఇష్టంవచ్చినట్లు ఉపయోగించుకోవడంతో తృప్తిపడక ఒకని భార్యలను మరియొకరు భ్రష్టుల గావించడంలో పరమానందంపొందుతున్నారు.

బూర్జువా వివాహం నిజంగా సమిష్టిభార్యల విధానమే. అందుచేత కపటంతో రహస్యంగా ఉంచబడీన స్త్రీలయందలి సమానానుభవాధికారాన్ని, బహిరంగంగా చట్టంచేత అంగీకృతమయిందిగా జేయగోరుతున్నామని యే బహుశ కమ్యూనిస్టులగు మేము అధికాధికంగా నిందింపబడ వచ్చును. బహిరంగ రహస్య వ్యభిచార విధానాలవల్ల తెలసిన స్త్రీలయందలి సమాన అనుభవాధికారం ప్రస్తుత ఉత్పత్తి విధా



నాన్ని నాశనంజేయడం తోడనే, దానితోపాటు నాశనం కావడం స్వతస్సిద్ధం.

మరియు కమ్యూనిస్టులు దేశాలను జాతీయతా భేదాలను, నాశనం జేయగోరుతూ ఉన్నారని నిందింప బడుతూ ఉన్నారు.

కార్మికులకు దేశమేలేదు. వారివద్ద లేనిదానిని వారి వద్దనుండి మేము ఎట్లుతీసికోగలం? శ్రామికులు ప్రప్రథమమున రాజకీయాధికారాన్ని ఆర్జించవలసి ఉండడంచేత వారు దేశానికి నాయకత్వం వహించే తరగతిగా కావలసివుంది; తానేజాతీయవర్గ స్థితికి రావలసి ఉంటుంది. అట్లు రావడంతో, బూర్జువా అర్థాన కాకపోయినప్పటికి,అది, నిజంగా, జాతీయత గలిగిఉంది.

బూర్జువావర్గం అభివృద్ధిచెందడంవల్ల, స్వేచ్ఛావాణిజ్యంవల్ల, ప్రపంచమార్కెట్టువల్ల, ఉత్పత్తివిధానమందలి ఏకరీతివల్ల, దాని ననుసరించే జీవితపరిస్థితులలో ఏకరీతివల్ల, దినదినం, క్రమక్రమంగా, జాతీయభేదాలు, వివిధజాతులమధ్య ఉండే స్పర్థలు నశించిపోతూ ఉన్నాయి.

శ్రామికవర్గంయొక్క యాజమాన్యం, అవి మరింత త్వరగా మాయమయ్యేదానికి కారణమగుతుంది. కనీసం నాగరికతగలిగి ప్రథమ శ్రేణియందుండే దేశాలన్నీ కలసి పనిచేయడమే శ్రామికవర్గ విముక్తికి ఒక ప్రథమ షరత్తు.

ఒక వ్యక్తిని మరియొకవ్యక్తి దోచుకోకుండా చేసే కొలది, ఒకజాతిని మరియొక జాతి దోచుకొనేవిధానంకూడ అంతమొందింపబడుతుంది. దేశంలోని వర్గాలమధ్య ఉండే స్పర్ధలు మాయమైపొయ్యేకొంది ఒకజాతి మరియొక జాతి యందుచూపే వైషమ్యంకూడ ఆఖరగుతుంది.

కమ్యూనిజానికి వ్యతిరేకంగా, మతదృష్టితో, తత్వదృష్టితో సామాన్యసిద్ధాంతదృష్టితో, తేబడే ఆరోపణలన్నీ తీవ్రంగా లెక్కపెట్ట తగినవికావు.

మానవుని భావాలు, అభిప్రాయాలు, తలంపులు, ఒకమాటలో మానవుని విచారణశక్తిఅంతా, అతనియొక్క భౌతిక జీవన పరిస్థితులందూ, అతని సామాజిక జీవితమునందూ, అతని సామాజిక సంబంధాలందూ కలిగే ప్రతిమార్పుతోను మారుతూవుంటాయని గ్రహించేదానికి అధికస్ఫూర్తి అవసరమా ?

భావాలచరిత్ర, భౌతికపదార్థోత్పత్తి మారేకొంది విజ్ఞానోత్పత్తికూడ దానిస్వభావాన్ని మార్చుకుంటూవుంటుందని కాక మరిదేన్ని రుజువు పరస్తూఉంది? ఎప్పుడును, ప్రతియుగమందూ, ప్రాబల్యాననుండే భావాలు, ఆకాలపు శాసకవర్గంయొక్క భావాలే.

సమాజాన్ని విప్లవోద్దీపిత మొనర్చే భావాలనుగూర్చి ప్రజలు మాట్లాడినపుడు, ప్రాతసమాజమునందే, క్రొత్త



సమాజంయొక్క ప్రాథమిక అంశాలు సృజింపబడ్డాయనిన్నీ, ప్రాతభావాలు జీవితంయొక్క ప్రాతపరిస్థితులతోపాటు శిథిలత చెందుతూ ఉన్నాయనే సంగతిన్నీ వెల్లడి అగుతూ ఉన్నాయి.

ప్రాచీనప్రపంచం తన అంత్యావస్థయందుండినప్పుడు, ప్రాచీనమతాలు క్రైస్తవమతంచే ఆక్రమించబడ్డాయి. 18 వ శతాబ్దంలో క్రైస్తవభావాలు హేతుభావాల ముందాగలేక పోయినప్పుడు, అప్పుడు విప్లవకారియగు బూర్జువా వర్గంతో జమీందారీసమాజం తన అవసాన యుద్ధాన్నిచేసి ఉండింది. మతస్వాతంత్ర్యం, వివేచనాశక్తి స్వాతంత్ర్యం, విజ్ఞానరంగాన స్వేచ్ఛాపోటీయొక్క శాసనాన్నే వ్యక్త పరచాయి.

నిస్సందేహంగా మత నీతి తత్వధర్మశాస్త్రభావాలు చారిత్రికాభివృద్ధియందు మార్చబడ్డాయి. కాని, మతం, నీతి తత్వజ్ఞానం రాజకీయ శాస్త్రం, చట్టశాస్త్రం, సదా ఈమార్పులను దాటుతూ నేటికిని జీవించే వున్నాయి.

"అంతేగాక, స్వేచ్ఛ, న్యాయం మొదలగు శాశ్వత సత్యాలు సమాజంయొక్క అన్నిస్థితులకూసమానమే కాని, కమ్యూనిజంశాశ్వత సత్యాలను నాశనం చేస్తుంది. మతమునంతా, నీతినంతా, నూతనవిధానంమీద నిర్మించక నాశనం

చేస్తుంది. అందుచేత పూర్వచారిత్రిక అనుభవాన్నికంతా వ్యతిరేకంగా అది పనిచేస్తూఉంది” అని అంటారు.

ఈనిందకర్థమేమిటి ? సమాజంయొక్క పూర్వ చరిత్రింతా వర్గస్పర్ధల అభివృద్ధి యనియేకదా? ఈస్పర్ధలు వివిధ యుగాలందూ వివిధ రూపాలు గైకొన్నాయిఅనేకదా?

కానిఅవిఎట్టిరూపం తీసికొన్నా పూర్వయుగాల కన్నిటికీ, సమాజమునందలి ఒకభాగాన్ని మరియొకభాగం దోచుకొనుచుండినదన్నసంగతిమాత్రం సమానమే. అందుచేత, పూర్వయుగములందుండే సామాజికవిచారణశక్తి అది చాలవిధాల ప్రకటితమగుతూ ఉండినన్నూ, కొన్ని సమాన రూపాలలోనే, కొన్ని సాధారణభావలలోనే పరిభ్రమిస్తూ ఉండేవి. ఇందు ఆశ్చర్యమేమీలేదు. ఇవి, వర్గస్పర్ధలు సంపూర్ణంగా మాయమయ్యేవరకు మాయం కాజాలవు.

కమ్యూనిస్టువిప్లవం, సాంప్రదాయసిద్ధ ఆస్తిసంబంధాలతోటి అతిసమూలకవిచ్ఛేదం. అందుచేత దాని అభివృద్ధి, సాంప్రదాయసిద్ధభావాలతో తీవ్రభేదం కలిగిఉండడంలో ఆశ్చర్యమేమీలేదు.

కమ్యూనిజం మొదల బూర్జువాచే ఆరోపించబడే ప్రతిబంధకాలను మనమింక వదిలివేస్తాము.



విప్లవమందు, కార్మికవర్గంయొక్క మొదటిపని శ్రామికవర్గాన్ని శాసక వర్గమయ్యేటట్లు చెయ్యడం, ప్రజాస్వపరిపాలనాన్ని స్థాపించడం అని మనం పైనచూచి ఉన్నాము.

శ్రామికవర్గం, తన రాజకీయాధికారాన్ని, బూర్జువా వర్గమునుండి క్రమేణ పెట్టుబడినంతా ఊడబెరికేదానికే, ప్రభుత్వంయొక్క (ప్రభుత్వంఅంటే శాసకవర్గంగా సంఘటింపబడ్డ శ్రామికవర్గం) అధికారం క్రిందకు ఉత్పత్తి పరికరణాలనన్నిటినీ కేంద్రీకరించేదానికి, సాధ్యమైనంత త్వరగా, ఉత్పత్తిశక్తులనన్నీ వృద్ధిచేసేదానికీ, వినియోగిస్తుంది.

మొట్టమొదట, ఆస్తిహక్కులమీద, బూర్జువా ఉత్పత్తి పరిస్థితులమీద నిరంకుశంగా దాడివెడలందే, ఇది సాధ్యంకాదు. ఆర్థికంగా చాలనట్టీ, సమర్థింపబడజాలనట్టీ చర్యలచేతనే ఇది చేయబడాలి. ఈ చర్యలు తమ పనికి (బూర్జువాఆస్తిమీదిదాడికి) పనికిమాలినవైపోయినపుడు పాత సామాజికవ్యవస్థమీద ఆక్రమణ మరింత అవసరం అవుతుంది. ఈ చర్యలు ఉత్పత్తివిధానాన్నంతా సంపూర్ణంగామార్చివేసేదానికి తప్పనిసరి అగుతున్నాయి.

ఈ చర్యలు వివిధదేశాలలోను వేరువేరుగా ఉండుననుట నిజం.

అయినా, అధికఅభివృద్ధిగాంచిన దేశాలలో ఈక్రిందివి సాధారణంగా ఆచరణయోగ్యాలు.

1. భూమియందు ఆస్తిహక్కును రద్దుపరచి భూమి యొక్క అధిక ఫలితాన్ని (Rent) ప్రజాకార్యాలకు వినియోగించాలి.

2 వృద్ధిక్రమానుసారంగా అత్యధిక ఆదాయపుపన్ను వేయాలి.

3. వంశపారంపర్యహక్కును లేకుండా చెయ్యాలి.

4. దేశాన్ని వదిలివెళ్లిన ప్రవాసకులయొక్క, విద్రోహులయొక్క ఆస్తినంతా లాగుకోవాలి.

5. సంపూర్ణగుత్తకలిగిన, ప్రభుత్వ పెట్టుబడితో, ఒక జాతీయ బ్యాంకును స్థాపించి దాని మూలంగా పరపతినంతా ప్రభుత్వం చేతుల్లో కేంద్రీకరించాలి.

6. రాకపోకలను, వర్తక సామాగ్రియొక్క రవాణా మార్గాలను, ప్రభుత్వం చేతులలో కేంద్రీకరించాలి.

7. ప్రభుత్వ స్వామ్యంగల ఉత్పత్తి సాధనాలను యంత్రాగారాలను వృద్ధిచెయ్యాలి. ఒక సాధారణప్రణాళిక ననుసరించి బీడుప్రదేశాలను సాగుబడి చేసేదానికీ, సామాన్యంగా నేలను అభివృద్ధి పరచేదానికీ ప్రయత్నించాలి.



8. ప్రతివాడును, పనిచేయవలసిన నిబంధనఉండాలి. పారిశ్రామిక సైన్యాలను ముఖ్యంగా వ్యవసాయమందు ఏర్పరచాలి.

9. యంత్ర పరిశ్రమలతో వ్యవసాయానికి ముడి బెట్టాలి.

10. ఇప్పటికన్న దేశమందంతా సమానంగా జన సంఖ్య యుండేటట్లుచేసి, పట్టణమునకు గ్రామమునకుగల భేదాన్ని క్రమేణ లేకుండ చెయ్యాలి.

10. ప్రజాపాఠశాలలలో, బిడ్డలందరికి ఉచితంగా విద్యచెప్పాలి. ప్రస్తుతరూపాన యంత్రాగారాలందు పిల్లల పని, లేకుండా చెయ్యాలి. విద్యను పారిశ్రామికోత్పత్తితో సమ్మిళితం చెయ్యాలి.

అభివృద్ధిద్వారా, వర్గభేదాలు మాయమై పోయి నప్పుడు. దేశమంతటియొక్క ఒక బ్రహ్మాండ సమితి ఆధీనంలో ఉత్పత్తిఅంతా కేంద్రీకరించబడినప్పుడు, ప్రభుత్వశక్తి తనరాజకీయ స్వభావాన్ని కోల్పోతుంది. రాజకీయాధికారం అని నిజంగా పిలువబడేది. కేవలం ఒకతరగతిని పీడించే దానికోసం ఏర్పడిన మరియొక తరగతి యొక్క సంఘటిత శక్తినే. బూర్జువావర్గంతోటి తన పోరాటమందు, పరిస్థితులప్రాబల్యాంచేత, శ్రామికవర్గం ఒకనూతన వర్గంగా తన్ను సంఘటిత

మొనర్బ్బికో వలసివచ్చిననూ, ఒక విప్లవంద్వారా తన్ను శాసక వర్గంగా చేసుకొన్ననూ, శాసకవర్గ హోదాలో బలాన్ని ఉపయోగించి ప్రాత ఉత్పత్తి పరిస్థితులను తుడిచి వేస్తుంది. అప్పుడు అది ఈ పరిస్థితులతోపాటు వర్గస్పర్ధలుండేదానికి అనువయిన పరిస్థితులను గూడ తుడిచివేస్తుంది. అట్లే సామాన్యంగా వర్గాలనుగూడ తుడిచివేస్తుంది. తద్వారా అది వర్గంగా ఏర్పడిన తన స్వీయాధికారాన్ని గూడ లేకుండః చేసిందవుతుంది.

ప్రాత బూర్జువా సమాజానికి బదులు, దాని తరగతులు, వర్గస్పర్ధలకు బదులు, ప్రతియొకని స్వేచ్ఛాభివృద్ధే అందరియొక్క స్వేచ్ఛాభివృద్ధికి మెట్టుగాగల ఒక సమితిని, ఒక సమాజాన్ని మనము పొందుతాము.





# అధ్యాయం మూడు.

## సోషలిస్టు కమ్యూనిస్టు సారస్వతం.

### 1. పురాతనవాదుల సోషలిజం.

### (అ) జమీందారీ సోషలిజం.

తమ చారిత్రిక స్థితినిబట్టి, ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాలలోని కులీనవర్గాలకు, ఆధునిక బూర్జువాసమాజానికి వ్యతిరేకంగా చిన్న పుస్తకాలను వ్రాయుటే వృత్తి అయింది. 1830 జూలై(23) ఫ్రెంచివిప్లవమందూ, ఇంగ్లీషుసంస్కరణాందోళన యందూ, ఈ కులీనవర్గాలూ, ద్వేషపూరితాలయిన ఈ తిరుగుబాటులకు లొంగిపోయాయి. అప్పటినుండీ వీరి దృక్పథాననుండి ఒక తీవ్ర రాజకీయ కలహం బొత్తిగా లేకుండ పోవలసివచ్చింది. కేవలం సారస్వత యుద్ధంమాత్రం మిగిలింది. సారస్వతమందుకూడ(24)రాజరికపునరుద్ధారణకాలపు నాటి ఆప్రాత సిద్ధాంతాలను, వెల్లడించడం అసంభవమయింది.

సానుభూతిని పొందేదానికి, కులీనవర్గాలు తనస్వీయ లాభాలనూ సైతముపైకి కనుపరచనీయక, పీడితకార్మికవర్గంయొక్క లాభాలను దృష్టియందుంచుకుని, బూర్జువావర్గానికి

వ్యతిరేకంగా నేరారోపణలు చేయవలసివచ్చింది. తమకొత్త యజమానికి వ్యతిరేకంగా కులీనులు, తమ నిందాగర్భిత పరిహాస వ్రాతలను పాడి, రాబొయ్యే ప్రళయాన్ని గూర్చి చెడు జ్యోతిష్యాన్ని దాని చెవులందు గొణిగి, తనపగ తీర్చుకున్నారు.

ఇట్లు, జమీందారీ సోషలిజం బయలుదేరింది: సగం ఏడ్పు సగం నిందాగర్భితపరిహాసం, సగం గతంయొక్క ప్రతిధ్వని, సగంభవిష్యత్తు యొక్క బెదరింపు. కొన్ని స్థలాలందు తన ములుకులవంటి కటుచమత్కార విమర్శనలతో బూర్జువావర్గం యొక్క హృదయానికి బాగుగా బాధకలిగేటట్టు చేస్తూ ఉండేది. కాని ఆధునిక చారిత్రకగతిని అర్థంచేసికొనలేని తన పూర్ణయశక్త్యతా ఫలితంగా ఎల్లప్పుడు దానివ్రాతలు పరిహాసాస్పదాలై ఉండేవి.

కులీనులు, ప్రజలను తమవైపు లాగుకొనే దానికి శ్రామికుల స్వల్పసౌకర్యములకు, పోట్లాడేవారు. కానిప్రజలు వారితో చేరినను, వారి జమీందారీ నిజతత్త్వాన్ని తెలుసుకొని, వదిలివేసి వచ్చేశేవారు.

ఫ్రెంచి సాంప్రదాయకులలోనిఒక తెగ 'తరుణఇంగ్లండు'ను ఈ దృశ్యాన్నే ప్రదర్శించాయి.



బూర్జువావర్గపు దోపిడినుండి, తమ దోపిడివిధానం వేరని చూపేటప్పుడు, జమీందారీ పక్షపాతులు ప్రస్తుతం పనికిరానంత ప్రాతవైన, పూర్తిగా వేరైన, పరిస్థితులందు, పరిసరాలందు తాము దోచుకొనుచుంటిమనే, సంగతిని మరచి పోతారు. తమశాసనంలో ఆధునికశ్రామిక వర్గమెప్పుడూ ఉండలేదని చెప్పేటప్పుడు తమ సామాజిక విధానంనుండే తప్పనిసరిగా పుట్టిందే ఈ ఆధునిక బూర్జువావర్గమనే సంగతిని వారు మరచి పోతారు.

మరియు, వారి విమర్శనయొక్క పురాతన స్వరూపాన్ని వారు మరుగుపరచడంలేదు. అందుచేత, బూర్జువా శాసనంక్రింద ప్రాతసామాజిక వ్యవస్థను పూర్తిగా కూకటి వేళ్ళతోసహా పెళ్ళగించివేసేటట్టి ఒకతరగతి పెంపొందుతూ ఉన్నదనే, బూర్జువావర్గంపై వారారోపించే ప్రధాననేరంఅని తెలసికోవచ్చు.

బూర్జువావర్గాన్ని అది శ్రామికవర్గాన్ని సృజించిందని వారెక్కువగా నిందించరు. విప్లవకారియగు శ్రామికవర్గాన్ని సృజిస్తూ ఉందనే వారి తీవ్రచీవాట్లు.

అందుచే రాజకీయాచరణలో వారు కార్మికవర్గానికి వ్యతిరేకంగా తీసుకోబడే నిర్బంధచర్యలందన్నిటిలోనూ, బూర్జువావర్గంతో ఏకీభవిస్తారు. సామాన్యజీవితమందు వారు

డాబుసరికబురు లెన్ని చెప్పిననూ, పారిశ్రామికవృక్షాలనుండి రాల్చబడ్డ బంగారపుపండ్లను తీసికొనేదానికీ, ఉన్ని, బీటు దుంప పంచదార, బంగాళాదుంపల సారాయిలయందు వ్యాపారంకోసం, సత్యాన్ని, ప్రేమను, మానాన్ని అమ్ము కొనేదానికి తయారగుతూ ఉన్నారు.

భూస్వామితో మతగురువు ఎప్పుడునూ, చేదోడు వాదోడై పోవుచుండునట్లే, అతని క్రైస్తవసోషలిజంకూడ జమీందారీ సోషలిజంతో ఐక్యతకలిగి నడుస్తూవుంది.

క్రైస్తవ సన్యాసిత్వానికి సోషలిజంయొక్క పైపూత పూసేదానికన్న సులభమైన పని లేదు. వివాహానికి వ్యతిరేకంగా వ్యక్తిగతఆస్తికిప్రభుత్వానికివ్యతిరేకంగా క్రైస్తవమతంప్రచారంగావించిఉండిందికదా?వీనికిబదులుదానందారిద్ర్యా, అవివాహితం,శరీరశోషణం,మఠాలందుజీవనం, దేవతామతల్లియగు చర్చినిగూర్చి బోధించి ఉండిందికదా! కులీనుని హృదయావేదనలను పవిత్రమైనవానినిగా చేసేదానికి పురోహితుడుపయోగించే పవిత్రతోయాలే క్రైస్తవసోషలిజం.

(ఆ) ఛోటాబూర్జువా యొక్క సోషలిజం.

బూర్జువావర్గంచేత నాశనం చేయబడింది కేవలం ఒక కులీన వర్గమే కాదు. తన ఆస్తిత్వానికి కావలసిన పరిస్థితులులేక ఆధునిక బూర్జువా సమాజంయొక్క



వాతావరణంలో కృశించి నశించింది. మధ్యయుగముందలి పుర నివాసులు, సొంతదారులగు చిన్నరైతులు, ఆధునిక బూర్జువా వర్గానికి అగ్రగాములు. పారిశ్రామికంగా,వాణిజ్యరీత్యా, చాలతక్కువగా అభివృద్ధి చెంది వుండే దేశాలలో ఈ రెండు తరగతులూ, పైకి వస్తూవుండిన బూర్జువా వర్గంతోపాటు, వృద్ధిపొందుతునే ఉన్నాయి.

ఆధునికినాగరికతపూర్తిగాఅభివృద్ధిచెందినదేశాలలోశ్రామిక వర్గానికి,బూర్జువావర్గానికిమధ్య అటునిటూఊగులాడే టట్టి,ఎల్లప్పుడునూ, బూర్జువా సమాజానికే అనుబంధ మయ్యేటట్టి ఛోటా బూర్జువావర్గమనే ఒక క్రొత్త తరగతి బయలు వెడలింది. ఏమైనా, ఈవర్గానికి చెందిన వ్యక్తులు పోటీ ఫలితంగా శ్రామికవర్గంలోకి త్రోసివేయబడుతూఉన్నారు. ఆధునికపారిశ్రామికాభివృద్ధిపెంపొందేకొద్దీఆధునికసమాజంలోతామొకప్రత్యేక తెగగా ఉండేదశ పూర్తిగఅదృశ్యమయ్యే సమయంసమీపించడం గూడ వారు తెలసికుంటూ ఉన్నారు. వారిస్థానాన పరిశ్రమలయందూ వ్యవసాయ మందూ, వాణిజ్య మందూ మేస్త్రీలు భూస్వాముల తలమనుష్యులు(సిగామానులు), దుకాణపు మనుష్యులు, నియమింపబడతారని గూడ వారెరుగుదురు.

జనాభాలో సగంకన్న అధికంగా రైతులను గల ఫ్రాంసువంటి దేశాలలో బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా

శ్రామికవర్గం వైపు వచ్చినవారు, బూర్జువా శాసనాన్ని విమర్శించడంలో రైతుయొక్క, ఛోటా బూర్జువాయొక్క, దృక్పథాన్ని తీసుకుని ఉండడం సహజమే. ఈ మధ్యతరగతుల దృక్పథాన్ని తీసికొనియే, కార్మికవర్గం వైపునుండి దెబ్బలాడడంకూడ సహజమే. ఈ విధంగా ఛోటా బూర్జువా యొక్క సోషలిజం బయలుదేరింది. సిస్మాండి 28ఈ తెగకు ఫ్రాంసులోనే గాక ఇంగ్లండులోకూడ నాయకుడు.

ఆధునిక ఉత్పత్తి పరిస్థితులందలి పరస్పర విరుద్ధతలను చాలాసూక్ష్మంగా ఈసోషలిస్టు తెగ పరీక్షించి చూపి ఉంది. అర్థశాస్త్రజ్ఞులయొక్క మాయసమర్థతలనన్నిటినీ, బట్టబయలు చేసివుంది. యంత్రాలయొక్క, శ్రమవిభజనయొక్క వినాశకరములగు ఫలితాలను, ఖండింప నలవికానట్లు నిరూపించివుంది. కొద్దిమంది వ్యక్తులచేతులలోపెట్టుబడి, భూమి ఏకత్రితముకావడంవల్ల అధికోత్పత్తిక్షోభలవల్ల కలిగే వినాశకరములగు ఫలితాలను రుజువుచేసివుంది. రైతుయొక్క, ఛోటా బూర్జువాయొక్క వినాశం తప్పదని చూపింది. శ్రామికవర్గం యొక్క శోచనీయావస్థను ఉత్పత్తియందలి అరాజకాన్ని, సంపద విభజనమందుండే దారుణ అసమానతలను, జాతుల మధ్యఉండే నిర్మూలకరమయిన పారిశ్రామికయుద్ధాన్ని, ప్రాతనీతిబంధనాల శిథిలతను ప్రాతకుటుంబ సంబాధాల జీర్ణావస్థను, ప్రాతజాతులయొక్క క్షీణతను ఎత్తిచూపింది.



అయినా దాని నిర్మాణ ఆదర్శాలలో ఈసోషలిస్టు తెగ ముందటి వుత్పత్తి మారకవిధానాలను, వానితో పాటు ముందటి ఆస్తిసంబంధాలను,ముందటి సమాజాన్ని, తిరిగి నెలకొల్పేదానికి ఆశిస్తూవుంది. లేదా ఆధునికఉత్పత్తి మారక విధానాలను ముందుండిన ఆస్తిసంబాధాల నిర్మాణమందు ఇరికించాలని కోరుతుంది. ఆ ఆస్థిసంబంధాలు ఈవిధానాలచే ధ్వంసం చేయబడడం తప్పదు.

ఈ రెండు ఆశయాలందునూ, అది పురాతనవాదుల ననుసరించేదిగాను ఊహాజనితమై అలభ్యమయిందిగాను ఉంది.

దాని అంత్య సిద్ధాంతాలు:—పరిశ్రమలలో సంయుక్త శ్రేణులు; వ్యవసాయాన పైతృక సంబంధాలు.

ఆఖరకు చారిత్రక ఘటనలు, ఆత్మవంచకత్వాంయొక్క మత్తుఫలితాలను చెల్లాచెదరు కావించినప్పుడు, ఈ సోషలిస్టు తెగ విచారగ్రస్తులకు సహజమయిన శోచనీయమూర్ఛలో అంతరించింది.

### (ఇ) జర్మను సోషలిజం.

### లేక

### 'నిజమయిన' సోషలిజం.

అధికారాననుండిన బూర్జువావర్గంయొక్క ఒత్తిడిచేత పుట్టి, ఈ అధికారానికి వ్యతిరేకంగా కొనసాగించబడుతూ

ఉండే పోరాటాన్ని వ్యక్తపరచే ఫ్రెంచిసోషలిస్టు కమ్యూనిస్టువాఙ్మయం, జర్మనులోకి, ఆ దేశమందు, బూర్జువావర్గం జమీందారీ నిరంకుశాధికారంతో తన పోరాటాన్ని ఆరంభించినప్పుడే, తీసుక రాబడింది.

జర్మనుతత్త్వజ్ఞులు, కాబోవుజర్మనుతత్త్వజ్ఞులు, జర్మను గ్రంథకర్తలు, ఈ వాఙ్మయాన్ని చాల ఆతురతో చదువసాగారు ఈ గ్రంథాలు ఫ్రాన్సునుండి జర్మనీలోకివచ్చినపుడు వానితోపాటు, ఫ్రాంసుసామాజిక పరిస్థితులుకూడ వలస రాలేదనే సంగతిమాత్రం వారుమరచి పోయారు. జర్మను సామాజిక పరిస్థితులందీ ఫ్రెంచివాఙ్మయం వెంటనే ఆచరణీయకరమగు తన ప్రాముఖ్యత నంతా కోల్పోయింది. కేవలం సారస్వతరూపం దాల్చింది. ఈవిధంగా 18వ శతాబ్దపు అంత్యమున జర్మనుతత్త్వజ్ఞులకు మొదటి ఫ్రెంచి విప్లవము యొక్క ఉద్దేశాలు, 'ఆచరణాత్మకబుద్ధి' యొక్క సామాన్య ఉద్దేశాలుగనే కనపడ్డాయి. ఫ్రెంచి బూర్జువా విప్లవకారుల సంకల్పము యొక్క కోర్కెలు జర్మనుతత్వజ్ఞులకు శుద్ధసంకల్పమును ఆదర్శప్రాయంగా ఉండవలసిన సంకల్పమును, అగు నిజమైన మానవ సంకల్పము యొక్క సామాన్య నియమాలుగా కనబడ్డాయి.

జర్మను పండితులపని తమ ప్రాచీనతత్త్వవివేచనా శక్తికి సానురూప్యంగా నూతన ఫ్రెంచిభావాలను తేవడమే.



తమ తత్త్వదృక్పథాన్ని వదలకయే, ఫ్రెంచిభావాలను కలుపుకొనడమే వారిపని.

ఒక విదేశీయభాషా సౌందర్యాన్ని తర్జుమావల్ల ఎంత మాత్రం గ్రహించకలుగుదురో అంతబాగుగానే ఈ కలుపుకోవడంకూడ చేయగలిగారు.

క్రైస్తవులుకాని ప్రాచీనప్రపంచం రచించిన శ్రేష్ఠ గ్రంథాల వ్రాత ప్రతులమీద క్రైస్తవసన్యాసులెట్లు కాథలిక్కు సిద్ధపురుషుల మూఢజీవితాల వ్రాశారో అది అందరికీ తెలిసిందే. జర్మను పండితులు, లౌకిక ఫ్రెంచివాఙ్మయములో ఈ విధానాన్ని తలక్రిందులచేసి ఫ్రెంచిమూలంక్రింద అర్థం లేని తమతత్త్వ శాస్త్రాన్ని వ్రాసిఉన్నారు. ఉదాహరణంగా, డబ్బుయొక్క ఆర్థికపనులగూర్చిన ఫ్రెంచివిమర్శనక్రింద వారు "మానవత్వంయొక్క పథభ్రష్టత"అని వ్రాశారు. బూర్జువాప్రభుత్వాన్ని గురించిన ఫ్రెంచి విమర్శనక్రింద వారు "వ్యాపక తెగయొక్క పదభ్రష్టత"అని యింకను ఇట్లే అనేకాలు వ్రాసి ఉన్నారు.

ఫ్రెంచి చారిత్రిక విమర్శనలచాటు ఈ తత్త్వపదాలను ప్రవేశపెట్టి వానికి "కర్మతత్త్వం" "నిజమగుసోషలిజం" "సోషలిజంయొక్క జర్మనుశాస్త్రం" "సోషలిజం యొక్క తాత్త్వికమూలాల సిద్ధాంతాలు" మరి ఇట్టిపేర్లనే పెట్టారు.

ఈ విధంగా ఫ్రెంచి సోషలిస్టు, కమ్యూనిస్టు వాఙ్మయమంతా పూర్తిగా పనికిమాలిందిగా చేయబడింది. జర్మను దేశీయుల చేతులలో, అది ఒకవర్గం మరియొకవర్గంతో చేసే పోరాటాన్ని వ్యక్తపరచడం మానుకొంది. అందుచేత, అతడు ఫ్రెంచి పక్షపాతాన్ని, ఏకైక దృక్కోణాన్ని, దాటితిమనే భావాన్ని పొందుతూ ఉన్నాడు. నిజమగు అవసరాలకు బదులు సత్యంయొక్క అవసరాలను చెప్పుతున్నామని, శ్రామికవర్గం యొక్క లాభాలనుగాక, మానవస్వభావంయొక్క 'సామాన్య మనుష్యుని'యొక్క లాభాలనే వెల్లడిస్తూఉన్నామనే భావాన్ని పొందుతున్నాడు. 'సామాన్యమనుష్యుడు' ఏవర్గానికీ చెందడు. అట్టివ్యక్తి లేనేలేడు. కేవలం అట్టివ్యక్తి తాత్విక కల్పనాశక్తి యొక్క అస్పష్ట ఊహాప్రపంచమందే ఉన్నాడు.

అంత తీవ్రంగా, శ్రద్ధగా, బడిబాలునికి తగిన తన ఈ పనిని చేసేదానికి పూనుకొన్న ఈ జర్మనుసోషలిజం, ప్రజల మనస్సులను ఆకర్షించేటట్టి తనకు వచ్చిన ఏ పాతికపదాలనో అంత డాబుసరిగా ఉపయోగించే ఈ జర్మనుసోషలిజం ఈ లోపల క్రమేణ, తన పాండిత్యంయొక్క అమాయకత్వాన్ని గోల్పోయింది.

జర్మను బూర్జువావర్గం ముఖ్యంగా ప్రష్యాను బూర్జువావర్గం, జమీందారీ కులీనులపాలనకు నిరంకుశ



రాజరికానికి, వ్యతిరేకంగా కొనసాగించే దెబ్బలాట అనగా జర్మనుఉదారోద్యమం మరింతతీవ్రమయింది.

దీనివల్ల, చాలకాలంగా కోరబడుతూఉండిన అవకాశం 'నిజమయిన' సోషలిజానికి, రాజకీయోద్యమాన్ని తనసోషలిస్టు కోర్కెలతో ఎదుర్కొనేదానికి లభించింది. ఉదారోద్యమానికి వ్యతిరేకంగా,, ప్రతినిధి సత్తాకానికి వ్యతిరేకంగా, బూర్జువా పోటీకి, బూర్జువా పత్రికా స్వాతంత్ర్యానికి, బూర్జువా శాసనాలకు, బూర్జువా స్వాతంత్ర్య సమానతలకు వ్యతిరేకంగా, తన సాంప్రదాయసిద్ధ శాపాలను ఇచ్చేదానికీ, ఈ బూర్జువా ఉద్యమమువల్ల తమకెట్టిలాభమున్ను లేదనిన్నీ అంతా నష్టమేనన్నీ, ప్రజాసామాన్యానికి బోధించేదానికీ, ఈ నిజమైన,జర్మనుసోషలిజానికి అవకాశందొరికింది.జర్మనుసోషలిజం ఫ్రెంచివిమర్శనయొక్క అర్థంలేనిప్రతిధ్వనేఅయినప్పటికీఅది క్లిష్టసమయాన ఫ్రెంచివిమర్శన, ఆధునిక బూర్జువా సమాజం తన ఆ సిత్వానికి కావలసిన ఆర్థికపరిస్థితులతో, దానికి తగియుండే రాజకీయ శాసనప్రణాళికతో, ఆవరకే ఏర్పడి ఉండే ఆధునిక బూర్జువాసమాజంమీద ఆధారపడివుంది అనే విషయాన్ని మరచిపోయింది. ఆపరిస్థితులను, ఆ శాసనప్రణాళికను పొందుటయే అప్పుడు జర్మనీయందు జరుగుచుండిన పోరాటంయొక్క ఉద్దేశమనే విషయాన్ని కూడ మరిచిపోయింది.

నిరంకుశ ప్రభుత్వాలకూ, వాని అనుచరులగు మత గురువులు, అధ్యాపకులు, గ్రామాలందలి పెద్ద భూస్వాములు ఉద్యోగులతోటి నిరంకుశ ప్రభుత్వాలకూ తమ్ము నాశనం చేసే దానికి తమపైబడవస్తూఉండే బూర్జువా వర్గాన్ని బెదరించి పారదోలేదానికి తగిన దిష్టిబొమ్మగా, ఈ నిజమైన సోషలిజం పనికివచ్చింది.

సరిగా ఆసమయమందే జర్మను కార్మికవర్గంయొక్క తిరుగుబాటు రోగాలను, ఈ ప్రభుత్వాలే కొరడాదెబ్బలు, గుండుదెబ్బలు అనే చేదుమాత్రలతో మాన్పాయి. దీనికి తోడ్పడింది ఈ నిజమైన జర్మనుసోషలిజమే.

ఈ విధంగా ఈ 'నిజమైన' సోషలిజం, ప్రభుత్వాలకూ, జర్మను బూర్జువావర్గంతో యుద్ధంచేసేదానికి ఆయుధంగా పనికివస్తున్నప్పుడే అది జర్మను అనాగరిక పురాతనవాదుల లాభాలను ప్రత్యక్షంగా వ్యక్తపరుస్తూ ఉండింది. 16 వ శతాబ్దానుండీ సదా వివిధరూపాలతో తలయెత్తుచూవచ్చిన ఛోటాబూర్జువావర్గమే జర్మనీలో వుండే స్థితిగతులకు నిజమయిన సామాజిక పునాది.

ఈవర్గాన్ని కాపాడడం జర్మనీలోవుండే ప్రస్తుత స్థితిగతులను కాపాడడమే. పెట్టుబడి ఏకత్రితము కావడంవల్ల, విప్లవకారియగు శ్రామికవర్గంయొక్క ఆవిర్భావంవల్ల, దీనిని



తప్పకుండా, బూర్జువావర్గంయొక్క పారిశ్రామిక రాజకీయాధికారం, నాశనం చేస్తుంది. "నిజమయిన"సోషలిజం ఈ రెండు ఉద్దేశాలను ఒకేపర్యాయం సాధించేటట్లు కనపడింది. అందుచేతనే అది దావాగ్నివలె వ్యాపించింది.

జర్మను సోషలిస్టులు తమ అసహ్యాకరమయిన "శాశ్వతసత్యాల"ను శబ్దాలంకారాలచేతను, ఊహలతోను, భావోద్రేకాలతోను అలంకరించడంచేత ఛోటాబూర్జువావర్గంలో విరివిగా చెలామణి చేసుకోగలిగారు

తనవంతుకు జర్మనుసోషలిజం రానురాను తన సొంత వృత్తి ఛోటాబూర్జువా అనాగరికుని యొక్క ప్రతినిధిగా డాబుసరిగా పనిచేయడమే అని కనుక్కొంది. జర్మను జాతి ఆదర్శప్రాయమగు జాతియనిన్నీ ఛోటా జర్మను అనాగరికుడు ఆదర్శమనిషి అనిన్నీ అది ప్రకటించింది. ఈ ఆదర్శప్రాయుడగు మనుష్యునియొక్క ప్రతిదుర్మార్గకరమగు నీచతకు అది గూఢ ఉన్నత సామాజికార్థాన్ని సెలవిచ్చింది. ఆఅర్థం ఛోటా బూర్జువాయొక్క నిజస్వభావానికి సంపూర్ణ విరుద్ధం. కమ్యూనిజం యొక్క "హృదయవిహీనమైన నాశనకారిమైన"దని చెప్పబడు పోకడను ప్రత్యక్షంగా ఎదుర్కొనే స్థితికి వచ్చింది అది. వర్గకలహా లన్నిటమీద తన అత్యధిక తిరస్కారాన్ని పక్షపాతం లేకుండా ప్రకటించే స్థితికికూడా వచ్చింది అది.

చాలకొలది అపవాదులతో సోషలిస్టు కమ్యూనిస్టు ప్రచురణాలనబడేవి జర్మనులో నేడు ప్రచలిత మయ్యేవి ఇట్టి దౌర్బల్యకారణమగు అసహ్యావాఙ్మయానికి చెందినవే.

2. సంకుచిత సోషలిజం లేక

బూర్జువా సోషలిజం.

బూర్జువావర్గంలో ఒకతెగ సామాజిక సంకటాలను చాపేదానికి కోరుతూ ఉంది. దాని ఆశయం బూర్జువా సమాజంయొక్క ఆస్తిత్వం కొనసాగేటట్లు చేయడమే.

అర్థశాస్త్రజ్ఞులూ, లోకోపకారకులూ, భూతదయాపరులూ, కార్మికవర్గంయొక్క పరిస్థితులను అభివృద్ధి చేయగోరువారు జీవకారుణ్యం సాఘుసభ్యులూ, మద్యపాన నిషేధమందు మూఢవిశ్వాసం కలవారు, ఊహించేదానికి వీలైన ప్రతి ఆతుకుబొతుకు సంఘసంస్కర్తలూ, ఈతెగకే చేరుతారు. పైగా ఈ సోషలిస్టుతెగ సంపూర్ణ విధానాలగా వివరింపబడిఉంది.

ఇట్టి రూపానికిఉదాహరణంగా ప్రౌధనుయొక్క "దారిద్ర్యతత్వమనే" పుస్తకాన్ని ఉదహరించవచ్చు.

సోషలిస్టు భావాలుగల బూర్జువా, ఆధునిక సామాజిక పరిస్థితులవల్ల తెప్పక కలిగే అపాయాలను,వర్గకలహాలను లేకుండా దాని లాభాలను సన్నింటిని మాత్రం, కోరుతారు.



ప్రస్తుత సామాజిక స్థితిని దానియొక్క విప్లవకరమయ్యేటట్టి వినాశకరమయ్యేటట్టీ స్వభావం లేకుండా కోరుతారు. వారు శ్రామికవర్గంలేనిబూర్జువావర్గాన్ని కోరుతారు బూర్జువా వర్గం సహజంగా తన అధికారంలో ఉండే ప్రపంచమే సర్వోత్కృష్ట మయిందని తలుస్తుంది. బూర్జువాసోషలిజం ఈ సౌఖ్యకరమయిన తలంపును ఎక్కువగానో తక్కువగానో తన సంపూర్ణ వివిధ విధానాలలో పెంపొందిస్తూఉంది. శ్రామిక వర్గం అట్టి విధానాన్ని కొనసాగించమనీ, అట్లుచేసి తిన్నగా భూతల స్వర్గానికి వెళ్ళమనీ కోరడం నిజంగా శ్రామికవర్గం ప్రస్తుత సమాజపు హద్దులలోనే ఉండి బూర్జువావర్గాన్ని గురించి తన మనస్సుయందుండే ద్వేషభావాలను మరచిపోవాలని కోరడమే.

ఈ సోషలిజంయొక్క మరియొకరూపం పూర్తివిధానం కలిగిఉండనప్పటికీ, ఎక్కువ ఆచరణసాధ్యం. జీవితంయొక్క భౌతికపరిస్థితులందూ, ఆర్థికసంబంధాలందూ కలిగేమార్పులు తప్ప మరెట్టి రాజకీయసంస్కరణాలవల్లనే వారికెట్టిలాభమూ ఉండదని నిరూపించడంచేత కార్మికవర్గపు దృష్టిలో ప్రతి విప్లవోద్యమంయొక్క విలువను తగ్గించేదానికి అది ప్రయత్నిస్తూఉంది. కాని, ఈరకపు సోషలిజం జీవితంయొక్క భౌతిక పరిస్థితులలోని మార్పులను, బూర్జువాఆస్తిసంబంధాల నాశనంగా అర్థం చేసుకోదు. అట్టి వినాశం కేవలం ఒక విప్లవం

ద్వారానే ఆచరణసాధ్యమగుతుంది. ఆ ఆస్తిసంబంధాల శాశ్వత ఆస్తిత్వంమీదనే ఆధారపడిన పరిపాలనా సంస్కరణలనే దాని అర్థం. అందుచేత ఆ సంస్కరణలు, ఏరూపాన గూడ, బూర్జువాశ్రామికవర్గాలమధ్యఉండే సంబంధాలను మార్చవు. అయితే అవి గరిష్టపక్షమున, బూర్జువాప్రభుత్వం యొక్క ఖర్చును తగ్గించవచ్చును. పరిపాలనాభారాన్ని తేలికజేయవచ్చు. క్లిష్టముకాకుండా చేయవచ్చు.

బూర్జువా సోషలిజం కేవలం శబ్దాలంకారమైనప్పుడు దానికి తగిన రూపాన్ని పొందుతుంది.

స్వేచ్ఛావ్యాపారం: కార్మికులయొక్క లాభంకోసమే! రక్షణసుంకాలు; కార్మికవర్గంయొక్క మేలుకోసమే! చెరసాల సంస్కరణాలు; కార్మికవర్గంయొక్క శ్రేయస్సుకోసమే !!! ఇవియే బూర్జువా సోషలిజంయొక్క అంతిమపదాలు. అది వేళాకోళంగా చెప్పని పదాలివిమాత్రమే.

ఒకే వాక్యాంశములో అదిక్రోడీకరింపబడి వుంది. కార్మికవర్గం క్షేమంకోసం బూర్జువా బూర్జువాగానే ఉండాలి.

### 3. విమర్శనాత్మక ఊహాజనిత సోషలిజం, కమ్యూనిజం.

ప్రతి గొప్ప ఆధునిక విప్లవంలోనూ, ఎల్లప్పుడూ శ్రామికవర్గంయొక్క కోర్కెలను ముందుకు తెచ్చే ఆ వాఙ్మ



యాన్ని ఇచ్చుట మేము సూచించడంలేదు. అట్టి వ్రాతలు బాబూఫువి (29) తదితరులవి.

తనసొంత ఆశయాలను పొందేదానికి, జమీందారీ సమాజం కూలదోయబడే సమయాన, సర్వత్ర ఉద్రేకం వ్యాపించి ఉండేసమయాన, శ్రామికవర్గంచే ప్రత్యక్షంగా చేయబడ్డ ప్రథమ ప్రయత్నాలు తప్పనిసరిగా విఫలమై పోయాయి. అందుకు కారణాలు శ్రామికవర్గ మప్పటికి అభివృద్ధి చెందకపోవడం, దాని విముక్తికి కావలసిన ఆర్థికపరిస్థితులు లేకపోవడం ఆ పరిస్థితు లప్పటికి ఇంకను కలుగజేయబడాలిసి ఉండాయి. అవి అప్పుడు రాబోవుచుండిన బూర్జువా యుగమందే సృజించబడి కలిగియుండాయి. ఈ ప్రథమ ఉద్యమాలను ననుసరించి బయలువెడలిన విప్లవ వాఙ్మయం అగత్యంగా పురాతనవాదుల ఫక్కి ననుసరిస్తూఉంది. అది విశ్వవ్యాపక సన్యాసిత్వాన్ని, అత్యంత మోటు తరమగు సామాజిక సమానతను బోధిస్తూ ఉండింది.

(30) సెయింటు సైమను, ఫోరియరు, ఓవను మొదలగు వారిసోషలిస్టు విధానాలు, కమ్యూనిస్టు విధానాలని సరిగానే పిలువబడుతున్నాయి. అవియన్నీ, పైనవర్ణించబడిన బూర్జువా శ్రామికవర్గకలహం అభివృద్ధిచెందకుండా ఉండే కాలంలో పుట్టాయి (మొదటిఅధ్యాయాన్ని చూడండి).

ఈవిధానాలను స్థాపించినవారు నిజంగా, వర్గస్పర్థలనూ, అప్పుడుండే సామాజిక రూపాలందుండే వినాశకరాలగు అంశాలనూ, తెలిసికొని ఉన్నారు. కాని అప్పటికింకా పసిప్రాయానఉన్న శ్రామిక వర్గం ఎటువంటి చారిత్రక ఆరంభంగాని, ఎటువంటి స్వతంత్ర రాజకీయోద్యమంగాని లేని ఒక వర్గంగా వారికి కనబడి ఉంటుంది.

పారిశ్రామికాభివృద్ధితోపాటు, సమానంగానే వర్గస్పర్థకూడ అభివృద్ధిచెందుటచేత, ఆర్థికస్థితిఉన్నరీతి శ్రామికవర్గం యొక్క విముక్తికి గావలసిన భౌతిక పరిస్థితులను ఇంకనుకలుగ జేయలేదని సోషలిస్టులు తెలిసికొన్నారు. ఈ స్థితులనుసృజించవలసిఉన్న నూతన న్యాయాలను, నూతన సామాజిక శాస్త్రాన్ని వెదుకసాగారు.

చారిత్రికశక్తి వారి వ్యక్తిగత కల్పనాశక్తికి తావొసగాలి. చారిత్రికంగా సృజింపబడి ఉన్న విముక్తి పరిస్థితులు ఊహాజనిత పరిస్థితులను తావొసగాలి. తనంతట తానేక్రమేణ ఏర్పడు కార్మికవర్గంయొక్క వర్గసంఘటన ఈ కల్పకులచే ప్రత్యేకంగా కల్పింపబడిన సామాజిక సంఘటనకు తావొసంగాలి. భవిష్యచ్చరిత్రంతా వారిసామాజికప్రణాలికలనుప్రచారమొనరించేదానిలోనూ, వానిని కార్యరూపాన పెట్టేదానిలోనూ, ఉంటుందని వారి అభిప్రాయం.



తమ ప్రణాళికలను ఏర్పరచేటప్పుడు కార్మికవర్గం అన్నిటికన్న అధికంగా బాధలననుభవించే తరగతియగుటచే, దానిక్షేమాన్నే వారు ముఖ్యంగామనస్సునంచుకున్నారు. కార్మిక వర్గమనగా అన్నివర్గాలకన్న అధికంగా బాధపడే వర్గమే అనివారి తలంపు. ఆదృష్టిలోతప్ప మరియే దృష్టియందునూ, కార్మికులున్నారనే సంగతిగూడ వారితలకెక్కదు.

వర్గకలహం ఇంకను అభివృద్ధి చెందనిస్థితి, తమస్వీయ పరిస్థితులు, ఈరకపు సోషలిస్టులను తాము వర్గస్పర్థలకతీతులమైనవారమని తలచేటట్లు చేస్తూఉన్నాయి సమాజంనందుండే ప్రతిసభ్యుని స్థితినీ అందరికన్న ఎక్కువ అనుకూలాలు గల వానిస్థితిని కూడా, వారు వృద్ధిపరచాలని చూస్తారు. అందుచేత వారు వాడుకగా సమాజానికంతా వర్గభేదాలు లేక తమ విన్నపాలను పంపుకుంటారు. ఎందుకంటే వారివిధానాన్ని ప్రజలొకపర్యాయం అర్థంచేసుకోగలిగితే సాధ్యమయ్యే శ్రేష్టతమసామాజికస్థితియొక్క శ్రేష్టతమమగు సాధ్య ప్రణాళిక వారివిధానం అని గుర్తించకుండా ఎట్లుండగలరు? అని వారి విశ్వాసం.

అందుచేత, వారు రాజకీయ కార్యాలను ముఖ్యంగా విప్లవకార్యాలను వద్దంటారు. వారు తమ ఆదర్శాలను, శాంతిమార్గాలద్వారా పొందగోరుతారు. చిన్నచిన్న ప్రయోగాలచే—అవి తప్పనిసరిగా విఫలంకాకతప్పవు—వానిని ఉదా

హారణంగా చూపి, తమ నూతనసామాజిక వేదానికి మార్గం సుగమంచేసేదానికి ప్రయత్నిస్తారు.

భవిష్యత్సమాజంయొక్క ఈ ఊహాజనిత చిత్రాలు, శ్రామికవర్గం ఇంకాచాల నిర్వికాసస్థితి యందున్న సమయాన తన స్థానాన్నిగురించి కేవలం ఊహాజనిత అభిప్రాయం కలిగి వుండేసమయాన, వ్రాయబడి సమాజంయొక్క సామాన్య పునరుద్ధారణకోసం ఆవర్గంయొక్క ప్రథమ సహజాభిలాషల ననుసరించే వున్నాయి.

కాని ఈ సోషలిస్టు కమ్యూనిస్టువ్రాతలు విమర్శ నాంశములతో కూడిఉన్నాయి. అవి ప్రస్తుతసమాజం యొక్క ప్రతిసూత్రాన్ని తీవ్రంగా విమర్శించి ఉన్నాయి. అందుచేత, కార్మికవర్గంయొక్క విజ్ఞానంకోసం, కావలసిన అమూల్యపరికరణాలను పూర్తిగా కలిగిఉన్నాయి. దానిలో ఆచరణీయమని ఉదహరించబడివుండేసూచనలన్నీ అప్పుడప్పుడే తలయెత్తుతున్న వర్గస్పర్ధలను మాయమయ్యేటట్లు చేసేదానికి వుద్దేశించబడ్డాయి. గ్రామాలకూ, పట్టణాలకూ, భేదంలేకుండా చేయడం; కుటుంబాన్ని వ్యక్తిగతలాభాన్ని వేతనవిధానాన్ని రద్దుపరచడం; సామాజిక సామరస్యాన్ని ప్రకటించడం, ప్రభుత్వంయొక్క పనుల నన్నిటినీ, వుత్పత్తిని తనిఖీచేసేవిగా మాత్రమే చేయడం; ఇవియే ఆ సూచనలు. ఈ వ్రాతలలో వర్గస్పర్థలు, వానియొక్క ప్రథమ అస్పష్టరూపాలతో, సరిగా



అర్థంగాని రూపాలతో కనపడుతూ వున్నాయి. ఈ సూచన లందుచేత కేవలం ఊహాజనితస్వభావం కలిగినవే.

విమర్శనాంశాలుగల ఊహాజనితసోషలిజం, కమ్యూ నిజములయొక్క ప్రాముఖ్యత, చారిత్రికాభివృద్ధి లేనప్పుడు ఎక్కువగాను, చారిత్రికాభివృద్ధి ఎక్కువయ్యేకొందీ, తగ్గి పోతునూఉంది. ఆధునికవర్గకలహం వికాసంచెందేకొందీ, స్పష్టరూపం తీసుకునేకొందీ, పోరాటాననుండీ విపరీతపు టెడబాటు, దానిమీద విపరీతవిమర్శనలూ ఆచరణరీత్యా తమ విలువనంతా, సిద్ధాంతరీత్యా తమ కారణానంతా పోగొ ట్టుకుంటాయి. అందుచే ఈవిధానాలకు మూలకారకులు అనేకవిధాల విప్లవకారులే అయిననూ, వారిశిష్యులు, ప్రతి విషయమందునూ, పురాతనవాదులే అగుతున్నారు.

అభివృద్ధికరమగు శ్రామికవర్గపు చారిత్రిక వికాసానికి వ్యతిరేకంగా వారు తమ గురువులయొక్క మొదటిభావాలనే పట్టుకొని వేళ్లాడుతారు. వారు అందుచేత, వర్గకలహాన్ని చల్లార్చి వర్గస్పర్ధలకు సామరస్యం కలుగజేసేదానికి ఎడతెగక పనిచేస్తారు. వారు తమ సామాజిక ఊహాసామ్రాజ్యాలు ప్రయోగసహితంగా సత్యాలయ్యాయని కలలు కంటూ వుంటారు. "సామ్యసంఘాలు" (31) "హోంముకాలనీలు" చిన్న 'ఇకేరియాలు' మొదలగు భూతలస్వర్గాలయొక్క అనుకర ణాలను చిన్నసైజున స్థాపించేదానికి కలలుకంటూ వుంటారు.





ఈ ఊహాసౌధాలన్నిటినీ ప్రత్యక్ష మొనర్చేదానికి వారు బూర్జువావర్గంయొక్క భావాలకు, దాని ధనానికి, తల లొగ్గుతారు. క్రమేణ వీరు పై నుదహరింపబడ్డ ప్రాచీన పద్ధతులకు ప్రయత్నించే సంకుచిత సోషలిస్టు తెగకు చెంది పోతారు. వారినుండి వీరు తమ అధిక క్రమానుసారమయిన పాండిత్యములోనూ, తమ సామాజిక శాస్త్రం అద్భుతమైన ఫలితాల నిస్తుందనే మూఢనమ్మకంలోనూ, భేదిస్తారు

వీరు అందుచే, కార్మికవర్గం ఎట్టి రాజకీయ కార్యాన్ని చేయరాదంటూ తీవ్రంగా అడ్డుపడతారు. అటువంటిదని, తమ నూతన వేదమందలి మూఢఅపనమ్మకంవల్లకలిగేఫలితమే అని వారి యభిప్రాయం.

ఇంగ్లండునందలి ఓవను అనుయాయులు చార్టిస్టులను ఫ్రాంసులోని ఫోరియరు అనుయాయులు సంస్కర్తలను వ్యతిరేకిస్తారు.

---



# అధ్యాయం నాల్గు

## ప్రస్తుతమున్న ప్రభుత్వవ్యతిరేక పక్షాలతో కమ్యూనిస్టుల సంబంధం.

ప్రస్తుతముండే ఇంగ్లండులోని చార్టిస్టులు, (32) అమెరికాలోని వ్యవసాయ (33) సంస్కరణవాదులు మొదలగు కార్మికపక్షాలతోటి కమ్యూనిస్టు సంబంధాలెట్టివో రెండవ అధ్యాయం స్పష్టం చేసింది.

కమ్యూనిస్టులు కార్మికవర్గంయొక్క తాత్కాలి కోద్దేశాలను, పొందేదానికి, దానియొక్క తాత్క్షణిక లాభాలను ఆచరణలో పెట్టేదానికి, పోరాడుతారు. కాని, వర్తమాన ఉద్యమమునందు వారు భవిష్యదుద్యమానికి ప్రతినిధిత్వం వహించి దానిని కాపాడుతారు. ఫ్రాంసులో కమ్యూనిస్టులు, సామాజిక (34) ప్రజాతంత్రవాదులతో, కన్సర్వేటీలకు, అతి ఉదారవాదులకు వ్యతిరేకంగా, ఏకమయ్యారు. కాని వారు ఫ్రెంచిమహావిప్లవంనుండి పరంపరగా వస్తూవుండిన భ్రమలను, పదసముదాయాన్ని విమర్శించే తమ హక్కును మాత్రం వదలుకొని వుండలేదు.

స్విడ్జర్లండులో వారు అతి వుదారవాదులను బలపరస్తూవున్నారు. కాని ఈ అతివుదారపక్షంయొక్క కొంత

భాగం ఫ్రెంచిసామాజిక ప్రజాతంత్రవాదులను బోలినవారు. మరికొంతభాగం అతి వుదారవంతులగు బూర్జువా. ఈ పక్ష మిట్టి పరస్పరవిరుద్ధాంశాలతో కూడివున్నదనేసంగతినిమాత్రం కమ్యూనిస్టులు మరవలేదు.

పోలండులో కమ్యూనిస్టులు జాతీయవిముక్తికి ప్రథమ షరత్తు కర్షకవిప్లవమనే పక్షాన్ని బలపరస్తూ వున్నారు. ఆ పక్షమే 1846 లో క్రాకో (35) విప్లవాన్ని రేపింది.

జర్మనీలో కమ్యూనిష్టులు, నిరంకుశ రాజరికానికి వ్యతిరేకంగా, జమీందారీ భూస్వామికానికి వ్యతిరేకంగా, ఛోటా బూర్జువాకు వ్యతిరేకంగా, విప్లవమార్గాన పనిచేసేదానికి పూనుకొనినప్పుడెల్లా, బూర్జువావర్గంతోకలిసి ప్రతిపక్షులతో పోట్లాడుతారు.

కానివారు ఒకక్షణమైనా శ్రామిక బూర్జువా వర్గాల యొక్క పరస్పర వైషమ్య పూరిత స్పర్థలను సాధ్యమైనంత స్పష్టంగా తెలిపేదానికి జర్మను కార్మికులకు నూరిపోయక ఉండరు. తన అధికారంతోపాటు బూర్జువావర్గం తప్పనిసరిగా ప్రవేశపెట్టాలసిన రాజకీయ సాంఘిక పరిస్థితులను, అనేక ఆయుధాలగా బూర్జువావర్గానికి వ్యతిరేకంగా జర్మనుకార్మికులు వెంటనే ఉపయోగించే దానికి జర్మనీయందలి పురాతనవాదుల పతనంపిదప బూర్జువావర్గంతోటి యుద్ధం వెంటనే ఆరంభమయ్యేదానికి ఈప్రచారం చేస్తారు.



కమ్యూనిస్టులు, తమ దృష్టి ముఖ్యంగా జర్మనీ వైపే త్రిప్పేదానికి కారణం:— ఆ దేశంలో, చాల వికాసంచెందిన యూరపు నాగరికతాపరిస్థితులలో, 17 వ శతాబ్దాన ఇంగ్లండులోని శ్రామికవర్గానికన్న, 18వ శతాబ్దంలోని ఫ్రాంసులోని శ్రామికవర్గానికన్న, అత్యధికాభివృద్ధిగాంచిన శ్రామికవర్గంతో బూర్జువావర్గం విప్లవం కొనసాగించే సమయం దగ్గరకువచ్చి వుండింది. మరియు జర్మనీలోని బూర్జువావిప్లవం దాని వెనువెంటనే వస్తూవుండిన శ్రామిక విప్లవానికి వుపక్రమణికయే.

కమ్యూనిస్టులు ప్రతిస్థలమందూ, ప్రస్తుతముండే సామాజిక రాజకీయస్థితిగతులకు వ్యతిరేకంగా లేచిన ప్రతి విప్లవోద్యమానికి చేయూత ఇస్తారు.

ఈ ఉద్యమాలన్నిటిలోను, వారు ప్రతివిషయాన, ప్రధానసమస్యగ దాని వికాసమాసమయానికి ఎట్టిస్థితియందుండింది అనే ప్రశ్ననే ముందుకు తెస్తారు.

ఆఖర, వారు ప్రతిస్థలమందూ, అన్నిదేశాలందుండే ప్రజాస్వపరిపాలనాపక్షంలోకే ఒడంబడికకు వచ్చి ఏకమయ్యేదానికి పనిచేస్తారు.

కమ్యూనిస్టులు తమ భావాలను, ఆదర్శాలను దాచేదానికి నిరాకరిస్తారు. వారు తమ ఆదర్శాలు, బలవంతంగా

ప్రస్తుతముండే సామాజికపరిస్థితులను నాశనంచేయందే పొంద బడజాలవని బహిరంగంగా చాటుతారు. కమ్యూనిస్టు విప్లవాన్నిగూర్చి ఆలోచిస్తూ శాసకవర్గాలు గడగడ కంపిస్తాయి! శ్రామికులు తమ సంకెళ్లనుతప్ప పోగొట్టుకొనేది మరేమీ లేదు. వారికిజయించేదానికి ఒక ప్రపంచమంతా ఉంది.

## అన్ని దేశాలందలి కార్మికజనమా ! ఏకముగండు !!!



# టీకలు.



(ఇందలి సంఖ్యలు పుస్తకంలోని అంకెలను సూచిస్తాయి. సం=సంపాదకునిచే (ఆంగ్లదేశపు) చేర్చబడ్డాయి. త=తర్జుమాదారునిచే చేర్చబడ్డాయి. ఏమీ గుర్తులేనివి ఎంజిల్సుచే వ్రాయబడ్డాయి)

1. లూయీఫిలిప్పురాజు:-1848లో ఫిబ్రవరి 24వ తారీఖున పారిసునగరంలోజరిగిన విప్లవంవల్ల పదభ్రష్టుడయ్యాడు. ఫ్రాంసు ప్రజాస్వామికం అని ప్రకటించబడింది.

2. 1848 జూను 23-27వ తారీఖులలో పారిసు కార్మికులు తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటును చాల రక్తపాతంతో కేవైగ్నక్ అనే సేనాధిపతి అణచివేశాడు. (సం)

3. 'బూర్జువా' అనే ఫ్రెంచి పదం అన్నిభాషలందూ వాడబడుతూ వుంది. దానిని సామాన్యంగా ధనికవర్గమని భాషాంతరీకరించవచ్చును. కానిఅది కేవలంధనికులకేకాక మధ్యతరగతికి, పెట్టుబడిదారులకుకూడవర్తిస్తూవుంది. ధనికులలోపెట్టుబడిదారులు కానివారికి తమడబ్బును పూడ్చిపెట్టే పిసినిగొట్టులకూ ఇది వర్తించదు. అందుచే దానికి సరియైనపదం లేకుండడంచేత విశ్వవ్యాపకమగు పదం ఆంధ్రభాషయందు కూడ

ఏలవ్యాపించ కూడదని దాన్నే ఉపయోగించాను. బూర్జువా అనగా బూర్జువా వర్గంలోని సభ్యుడు లేక సభ్యులు.

(4) పైరీజోసెఫ్ ప్రౌధను 1809—1865):— ఫ్రెంచి పత్రికారచయిత. అర్థశాస్త్రజ్ఞుడు. ఛోటా బూర్జువా సోషలిజంయొక్క ప్రధానాచార్యుడు. (సం) కట్టకడకు అరాజకవాదానికి బీజాలను చల్లి బకునినుపై తన ప్రభావాన్ని పరిపాడు. ఇతడు వ్రాసినరెండు గొప్పగ్రంథాలు,'ఆ సియేమి' 'దారిద్ర్యతత్వం' అనేవి. బకునిను రష్యాదేశీయుడు అరాజకోద్యమానికి ఆచార్య పురుషుడు. (త)

(5) ఫెర్డినాండు లాస్సలే (1825—64) మాటోము ఖాముఖగా తాను మార్క్సు శిష్యుడననిన్నీ, అందుచే కరపత్రింయొక్క సిద్ధాంతాలపైననే తానుకూడ ఆధారపడి ఉన్నాననిన్నీ ఎప్పుడూ అంగీకరిస్తూ ఉండేవాడు. కాని తన ప్రజాందోళనయందు (1862—64) అతడు ప్రభుత్వపరపతి మీద ఆధారపడిన సహకార కర్మాగారాలను కోరేవాని కన్న మరేమీ సూచించి ఉండలేదు.

(6) హెర్జను రష్యను విప్లవకారుడు—త.

(7) రాబర్టు ఓవను (1771-1858) ఊహాజనిత సోషలిజంయొక్క ఇంగ్లీషుదేశపు ప్రధానపురుషుడ. అతడు చిన్న కమ్యూనిస్టు సమాజాలలో ఆర్థికసాంఘిక జీవితం సమిష్టిగా



నిర్ణీతమగుతుందని సూచించి యుండెను. ఆ సమాజంలో ఆ సమిష్టిగా వుండును.—(సం)

(8) ఘోరియయుఫ్రెంచి ఊహాజనిత సోషలిజంయొక్క ప్రధానపురుషుడు. పూర్తిపేరు ఫ్రాంకాంయి ఛార్లీఫోరియయు (1772-1837) సోషలిస్టు కార్య ప్రణాళికమీద ఆధారపడిన గ్రామ విధానాన్ని సూచించాడు. బూర్జువా సమాజంయొక్క ఇతని విమర్శన మూలసిద్ధాంతాలకే పోతుందని మార్క్సు ఎంజెలుసు అంగీకరించివున్నారు.—(సం)

(9) ఎటిసీకాబెటు (1788-1856):—1830 జూలై ఫ్రెంచి విప్లవంలో పాల్గొనినందులకు ఇంగ్లండులో ప్రవాసశిక్ష ననుభవిస్తూవుండిన ఫ్రెంచి ఊహాజనితసోషలిస్టు కమ్యూనిస్టు సమాజమునందు జీవిత మెట్లుండునో తెలుపుతూ, ఒక పుస్తకాన్ని వ్రాశాడు.—(సం)

(10) విల్హెల్మ్ పీట్లింగు (1808-1871):—1848 లో జర్మను విప్లవోద్యమమునందు పాల్గొనిన జర్మను ఊహాజనిత సోషలిస్టు. అతడు విప్లవసమయాన జర్మనుకార్మికులయందు చాల పలుకుబడికలిగి ఉండెను. అమెరికాకువచ్చి జర్మను కార్మికులమధ్య సోషలిస్టు ప్రచారంచేశాడు:—సం.

(11) డార్విను సిద్ధాంతం:—విశ్వమంతా పరిణామము చెందుతూ వుందని శాస్త్ర రీత్యా రుజువుచేసిన ఆంగ్లదేశపు

వైజ్ఞానికుడు. ఇతడే మానవుడు కోతినుండి వృద్ధిపొందియున్నా
డని రుజువుచేసింది:—త.

(12) 1871లో మూడవనెపోలియను ప్రషియాలో యుద్ధంచేసి ఓడిపోయినపిదప పారిసు కార్మికులు తిరుగబడి తమ అధికారాన్ని స్థాపించారు. వారి నాయకులు శ్రామిక నిరంకుశాధికారాన్ని పూర్తిగా స్థాపించి అంతకు ముందటి ఫ్రెంచి ప్రభుత్వవర్గాన్ని పూర్తిగ నాశనం గావించకుండా దానిని బాగుచేసేదానికి ప్రయత్నిస్తూవుండడంలో థీర్సుఅను ఫ్రెంచి ప్రధానామాత్యుడు వెర్సైయిల్సునుండి బలాన్ని చేర్చుకొని కార్మిక ప్రభుత్వాన్ని దారుణంగా హత్య గావించాడు. ఈ కార్మిక ప్రభుత్వానికే పారిస్ కమ్యూను అను పేరు:—త.

(13) మెట్టర్నిచ్ (1773_1859) ఆస్ట్రియా సామ్రాజ్యంయొక్క ప్రధానామాత్యుడు. యూరపుయొక్క అభివృద్ధిని వెనక్కి నెట్టగోరిన ఘనుడని అందరంగీకరించిందే. గ్వీజొట్ [1787_1874] ఫ్రెంచి ప్రభుత్వంయొక్క, ఫ్రెంచిపారిశ్రామిక బూర్జువావర్గంయొక్క పక్షపాతి. అతడు శ్రామిక వర్గానికి తీవ్రవిరోధి. ఫ్రెంచి అత్యుదారవాదులగు మారస్ట [1802_52] కార్నట్ [1801_1888] మేరీ [1775_1870] లకూ, సోషలిస్టులకూ, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా తరచు యుద్ధం గావించేవాడు:—స.



(14) బూర్జువా అనగా ఆధునిక పెట్టుబడిదారులు, సామాజిక ఉత్పత్తి పరికరణాల యజమానులు, జీతాలిచ్చి పనిచేయించుకొనేవారు. శ్రామికులనగా తమ సొంత ఉత్పత్తి పరికరణాలు లేక, జీవించేదానికి తమ 'శ్రమశక్తి'ని అమ్ముకొనేవారు.

(15) సమాజపుచరిత్ర:—వ్రాయబడిన చరిత్ర అని అర్థం. 1837లో వ్రాయబడిన చరిత్రలో, ముందుండిన సామాజిక వ్యవస్థనుగూర్చి బొత్తిగా ఏమీ తెలియదు. దానితరువాత అగస్టువాన్ హాక్సుతౌసను (1792-1866) రష్యాలో భూమిమీద సమిష్టి అధికారముండేటట్లు కనుగొన్నాడు. జార్జి లడ్విగ్ వాన్‌మారల్ టూటానికు జాతులకాధారభూతమయిన సామాజిక పునాది ఇదేఅని నిరూపించాడు. తదుపరి ఇండియానుండి ఐర్లండువరకూ ప్రతిచోట, ఆదిమ సామాజిక వ్యవస్థగా గ్రామతెగలె ఉండినవని తెలిసికొనబడింది. ఈ ఆదిమకమ్యూనిస్టు సమాజంయొక్క అంతర్వ్యవస్థ దాని సహజరూపాన, హెన్రీమోర్గన్ (1818-1881) బయటపెట్టాడు. ఈ పరిశోధనా ఫలితం గణములయొక్క నిజస్వభావాన్ని, దానికి తెగలతో ఉండే సంబంధాన్నిగూర్చి తెలుపుతూఉంది. ఈ ఆదిమతెగలు శిథిలత చెందినపిదప సమాజం మొదట, ప్రత్యేకవర్గాలగా విభజించబడింది. దానిపిదప ఈ ప్రత్యేకవర్గాలు పరస్పర స్పర్థతోకూడిన తరగతులయ్యాయి.

"కుటుంబం వ్యక్తిగతఆస్తి,ప్రభుత్వం వీరియొక్క పుట్టుక" అనే నాపుస్తకంలో నేనీశిథిలతను, నేటినుండి ఆదిమావస్థవరకు వ్రాసేదానికి ప్రయత్నించాను.

16. ప్రత్యేకాధికారాలు పొందినట్టే, పట్టణాలందు చేర్చుకోబడడంచేత సంపూర్ణ రాజకీయాధికారాన్ని పొందిన స్వతంత్ర వ్యక్తులకే పురవాసులని వ్యవహరించబడ్డది.—సం.

(16. అ.) వృత్తిశ్రేణులు జమీందారీ యుగాన ఇతరుల రానియ్యనట్టీ ప్రత్యేకాధికారాలు గలట్టీ, వృత్తికారుల సంఘాలచే నిర్మింపబడి ఉండాయి. వీనికి మార్కెట్టులమీద గుత్తఅధికారాన్ని పురపాలక సంఘాలు ఇచ్చేవి. ఈశ్రేణులు తమ సభ్యులు అతిచిన్న విషయాలలోనూ, నడచుకొనే విధానాన్నిగురించి నియమాలను ఏర్పరచి ఉండేవి. పనిచేసే గంటలనుగూర్చి, జీతాలు, వెలలు,పనిముట్లు, కూలీలను నియమించుకొనే దాన్ని గూర్చి, ఈ నియమా లుండేవి.—సం.

(17) 'మూడవతెగ'గా తమ జమీందారీ ప్రభువుల నుండి తాము, రాజకీయాధికారాల్ని, స్థానికస్వపరిపాలనాన్ని జయించుకొనే దానికి ముందుగానే, ఫ్రెంచిపట్టణాలు పెట్టుకొన్న పేరు కమ్యూను. బూర్జువావర్గంయొక్క ఆర్థిక వికా



సానికి ఇంగ్లండునూ, రాజకీయ వికాసానికి ఫ్రాన్సుయు, సామాన్యంగా వుదాహరణంగా తీసుకోబడ్డాయి.

(18) 'మూడవతెగ':—రాజకీయాధికారాలు మొదట మతగురువులకు, కులీన వర్గాలకుమాత్రమే ఉండాయి. ఆ పిమ్మటనే, వృద్ధిచెందుచూ వచ్చిన పురవాసులు మూడవ తెగగా అంగీకరించబడి, రాజకీయాధికారాల్ని పొందింది—త.

(19) జమీందారీ కేవలం పెద్దభూస్వాములని అర్థం కాదు తమ అధికారంక్రింద ఉండే పొలాలలో, నివసించే రైతులు ఆసంవత్సరానికి కొన్నిదినాలు వచ్చి కూలీ తీసికోక పనిచేసేటట్లు గల విధానం. త.

(20) సమత్రికోణాకారం గల గొప్ప సమాధికట్టడాలు త.

(20) రోజుకు పదిగంటలకన్న అధికంగా పనిచేయింపకూడదు, అని శాసించేబిల్లు ఇంగ్లీషు కార్మికులు 30 ఏండ్లు ప్రయత్నించిన పిదప కడకు 1847 లో చట్టం చేయబడింది. సం.

(22) మార్క్సు అభిప్రాయం కమ్యూనిస్టు పక్షాన్ని ప్రత్యేకంగా ఏర్పరచ కూడదని కాదు. 1847 నాటి సంవత్సరములోని పరిస్థితులబట్టి చూస్తే ప్రత్యక్షంగా ఉండాలసిన అవ

సరంలేకపోయింది, అప్పుడుండిన కార్మికపక్షాలు చాలకొద్ది. ఇంగ్లండులో చార్టిస్టుపక్షం, ఫ్రాంసులోని సంస్కరణ పక్షం ఈరెంటికిని కమ్యూనిస్టులకునూ కొన్ని భేదా లుండి నప్పటికీ కమ్యూనిస్టులు వారితో కలిసే పని చేస్తూఉండేవారు. త.

(23) 1830 జూలైలో 10వ ఛార్లీమీద పారిసునగర వాసులు తిరుగుబాటుచేశారు. బూర్బనువంశపు ఫ్రెంచి వంశపు మొదటిశాఖ పదచ్యుతి చేయబడింది. రెండవశాఖ యగు ఆర్లియనుశాఖకు చెందినవ్యక్తి ఫ్రెంచి రాజయ్యా డు—:సం

(24) 1660-1689 వరకువుండిన ఇంగ్లీషురాజరిక పునరుద్ధారణకాదు. 1814-1830వ వరకుండిన ఫ్రెంచిరాజరిక పునరుద్ధారణ.

(25) ఫ్రెంచి సాంప్రదాయకులు బూర్బను వంశపు ప్రథమ శాఖాపక్షపాతులు—:సం

(26) 'తరుణ ఇంగ్లండు'లో దయార్ద్రహృదయులగు కొలదిమంది 'టోరీలు' (ప్రస్తుతకన్సెర్వేటివ్‌లకు మనుపటిపేరు), బ్రిటిషు ఐర్లండుదేశపు కులీనులయువకబృందం ఉండేవారు. వీరు పారిశ్రామిక పెట్టుబడిసమాజాన్ని, తీవ్రంగా ఎదుర్కొనేవారు. జమీందారీప్రభుత్వాన్ని తిరిగి స్థాపించాలని కోరేవారు—సం.



(27) ఇది ముఖ్యంగా జర్మనీకే వర్తిస్తుంది. అచ్చట భూస్వాములు తమ ఎస్టేటులలో ఎక్కువ భాగాన్ని తమకోసం (నిగమానులుచే) 'తలమనుషులచే సాగుబడిచేయించుకుంటూఉండేవారు. అంతేగాకవారిఆధీనమునవిస్తారంగాబీటుదుంప పంచదార తయారు చేసేవారు. బంగాళాదుంపలనుండి సారాయిని వడగట్టేవారు. ఎక్కువగాఉండేవారు వారికన్న ధనికులగు, బ్రిటిషు కులీనులు అప్పటికట్టి నీచకార్యాలకుతయారై ఉండలేదు. కాని వారు కూడ తమకు వచ్చే మగతాలుతగ్గ కొందీ, ఆ లోటును పూర్తిచేసేదానికి, బూటకపు జాయింటు స్టాకు కంపెనీలను ఆరంభించేవారికి తమ పలుకుబడిని ఇచ్చి డబ్బు గడించేవారు. (జాయింటు స్టాకు కంపెనీలంటే ఉమ్మడి పెట్టుబడిసంఘాలు)

(28) జీన్ ఛార్లీ లియోనార్డు సిస్మాండి (1773-1842 ఫ్రెంచి చరిత్రకారుడు అర్థశాస్త్రజ్ఞుడు:—సం.

(29) ఫ్రాంకోయి నోయలు బాబూఫ్(1764-1797) ఫ్రెంచి మహావిప్లవమున ఒక అది ఉదార ప్రజాస్వామికుడు. బూర్జువాప్రభుత్వాన్ని కూలద్రోసి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించేదానికి ఒక విప్లవాన్ని రేపేదానికి ప్రయత్నించాడని ఉరి తీయబడ్డాడు.—(సం)

(30) క్లాడీహెన్రీ తిరువాన్రియ్ సెంట్ సైమన్(1760 1825):—ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు భవిష్యత్తునందు

సమాజమందు ప్రధాన సమస్యకార్మిక ప్రశ్నయేఅని అతడూహించకలిగాడు. ఆసమస్యకు పరిష్కారమార్గం సహకార కలయికవల్ల ఉత్పత్తిని నిర్మించడమే అని సూచించాడు—

(31) సామ్యసంఘాలు ఛార్లీఫోరియరు విధానంమీద ఆధారపడి నిర్మించబడ్డ సామ్యవాద వలసరాజ్యాలు. 'ఇకేరియా" అనేది కాబెటు తనవ్యూహాజనిత సామాజిక వ్యవస్థకు ఇచ్చినపేరు. ఈపేరునే తదుపరి ఆయన తాను స్థాపించిన అమెరికాలోని కమ్యూనిస్టుల వలస స్థలానికి కూడఇచ్చాడు.

(32) బ్రిటిషు కార్మికులయొక్క సంఘటిత ఉదార రాజకీయోద్యమం (1837—1848) పేరు చార్టిజం, ప్రజా అధికార పత్రం కార్మికుల తాత్కాలిక పరిస్థితులను అభివృద్ధి పరచేదానికి చట్టసంస్కరణాలను కలిగిఉండింది. వానిని పొందేదానికే చార్టిస్టులు పోరాడారు. సం.

(33) అత్యధికమగతాలకు వ్యతిరేకంగా న్యూయార్కు వ్యవసాయదారులు పోరాడుచుండేటప్పుడు, తరుణ అమెరికా, సంఘపునాయకులు భూమి ప్రభుత్వాధీనం కావించబడాలనీ, ప్రతిపొలమూ 160 ఎకరాలకు మించి ఉండగూడదని కోరారు. వ్యవసాయ చట్టంలో కొద్దిమార్పులు చేయగానే ఈ ఉద్యమం నశించిపోయింది. సం.



(34) ఈ పక్షం అప్పుడు పార్లమెంటులో లెడ్రూరోల్లిన్నూ, వాఙ్మయంలో లూయీబ్లాంకు (1811-82)నూ, దినపత్రికలలో 'రిఫార్మ్'ను కలిగి వుండింది. 'సామాజిక ప్రజాతంత్రవాదు,లనేపేరు, ఈ పక్షాన్ని ఏర్పరచిన, పైవారితోపాటు ప్రజాతంత్ర పక్షంలోని (ప్రజాస్వామికపక్షంలోని) సోషలిజం పైపూతగల కొంతభాగంకూడా ఇందుండినట్లు తెలియజేస్తూఉంది.

(35) క్రాకోపోలిషు విప్లవం మెట్టర్నిచ్ యొక్కకుట్రచే అణచివేయబడింది. కాని దానిమూలంగానే పాశ్చాత్య దేశకార్మికపక్షాలలో, విప్లవకారులలో, జనసామాన్యంలో పోలిషుసమస్య ప్రధానత్వం వహించింది. దానిసమస్య ప్రధాన సమస్య ఆయింది.—త.





# GLOSSARY.



Antagonism = స్పర్థ.

Appropriation = వినియోగం.

Aristocracy = కులీనవర్గం. కులీనప్రభుత్వం.

Bourgeois = బూరువా.

Bourgeoisic = బూరువావర్గం.

Centralisation = కేంద్రీకరణం.

Class = వర్గ, తరగతి

Collective = సమిష్టి.

Commerce = వ్యాపారం. వాణిజ్యం.

Commodity = వర్తకపుసరకు.

Common = సమిష్టి.

Competition = పోటీ.

Complement = సహజపర్యవసానం.

Concentration. = ఏకత్రితము.

Conscience = విచారణాశక్తి, వివేచనాశక్తి

Conservatives = యథాస్థితివాదులు.

Demand = గిరాకి.

Demands = కోరికలు.

Exploit = దోచుకొను.

Exploitation = దోపిడి

Factory = యంత్రాగారం.

Feudal = జమీందారీ.

Freedom = స్వేచ్ఛ.

Guild = శ్రేణి.

Ideas = భావాలు.

Ideology = ఆదర్శం.

Ideologists = ఆదర్శవాదులు.

Independence = స్వాతంత్ర్యము, స్వతంత్రత.

Intuition = స్ఫూర్తి.

Journeyman = శ్రేణియందలి కూలివ్యక్తి.

Jurisprudence = ధర్మశాస్త్రం.

Labour = శ్రమ.

Labour, division of = శ్రమవిభాగం, శ్రమవిభజన.

Labour—Power = శ్రమశక్తి.

Law = చట్టం, న్యాయము.

Moncpoly = గుత్త

Monorachy = రాజరికం.

Morality = నీతి.

Nation = జాతి, దేశము.

Patriarchal = పైతృక.

Patrician = కులీనుడు.

Phantastic = ఊహాజనిత, విపరీత.

Plan = ప్రణాళిక.

Plebeian = సామాన్యవంశజుడు.

Price = మూల్యం, వెల.

Principle = సూత్రం.

Progressive = వృద్ధిక్రమానుసారంగా.

Proletarian = శ్రామికుడు.

Proletariat = శ్రామికవర్గం.

Radical = అతివుదారవాది.

Reactionary = పురాతనవాది.

Representative government = ప్రతినిధిసత్తాకం.

Republic = ప్రజాస్వామికం

Republican = ప్రజాస్వామికుడు.

Self - sufficiency = స్వయంసంపూర్ణత.

Serf = దాసుడు.

Slave = బానిస.

Stage = దశ.

Struggle = కలహం. వివాదము, పోరాటం.

Supplement = అనుబంధం.



Surplus = అధికత.

Theoretically = సిద్ధాంతరీత్యా.

Theory = సిద్ధాంతం.

Third Estate = మూడవతెగ.

Trade = వర్తకం.

Utopian = ఊహాజనిత.

Value = విలువ.

Work = పని.

Worokers = కార్మికులు.

Workshop = కర్మాగారం.





